# రాజభిక్షుకుఁడు

---

పగ లెల్ల వరిచేలఁ బనిపాటు చేసి
ప్రొద్దుగ్రుంకెడివేళఁ బొలమును వీడి
యిలు సేరి నూకల నిగిరించి, వేడి
సంగటిఁ గుడిచెడి సమయంబునందు,
సన్నచీఁకటి రూప సౌందర్యగరిమ
మబ్బువాఱుచునుండ, మాకుటీరంపు
ద్వారంబు కడనిల్చి ధరణీవిభుండు
ముసిముసి నవ్వుల మొగమందగింప
సందె కబళము వేఁడెఁ!—జకితనై నేను
నొడలు కంపింపంగ నొక్కమాటైనఁ
బలుకఁ జాలక మోమువంచి నిలుచుంటి;
నంతనెచ్చోటికో నరిగె రారాజు.
అవి యువియని యెంచ నలవిగానట్టి
చిదురుఁ దలంపులు చీకాకువెట్టఁ
జేతిలోఁ గబళంబు చేతనేయుండ
నూరక కూర్చుండి యున్నతరుణమున
నెచ్చటనుండియో వచ్చి బిచ్చకుఁడు

జాలిపుట్టగ వేఁడ సందేకబళంబు.
కనికరంబున నేను గడియన్న మెత్తి
"యిదిగో కొమ్మ"ని చేత నిడితి; బికారి
యానవాలుగ దీని నర్పింతుననుచు
నుంగరంబొక్కటి యొసఁగి తా నేఁగె;
నంత దీపపువెల్గు నందు నే దానిఁ
గన, రాజముద్రిక యసితోఁచె; నేఁడు
రాజు భిక్షార్థియై రాఁగతంబేమొ
మాబోఁటి నిఱుపేద మాలకొంపలకు?

---

# మృత్యువు

---

ఓమృత్యుదేవతా ! యోజగద్రాక్షి !
జంటబిడ్డలపోల్కి జన్మించినారె
జీవితంబును నీవు సృష్ట్యాదియందు !
మనుజుండు నిన్నెవ్వ మహాసురమూర్తి
భయసముత్పాదక బహుళవర్ణములఁ
జిత్రించి యాత్మీయ సృష్టినిఁ గాంచి
భీతచేతస్కుఁడై విభ్రాంతినందు !
మూఢభక్తియుఁ గాలమును బనుగుపేన
యనఁగ, భావమునాడె యుట్టులఁ దిరుగఁ
బ్రీతిఁ బౌరాణికి విశ్వాసమనెడి
వల నేసి దైవ విపాకంబుకితనఁ
బాపము ! తానందుఁబడి చిక్కుకొనియుఁ.
దప్పించుకొనుటకు దారి గన్పడదు.
    ని కన్నుబొమ్మలు నీహారఖండ
శిశిరంబులంట ! నిర్జీవధావళ్య
జలదంబు నీకన్ను జంటచుక్కలను
గబళించునంట ! యో కాలస్వరూపి
ణీ ! మానవునితోడ నీవు నెల్లపుడు
దాగుడుమూతల తందనాలాడి
చేయిఁ జిక్కక యెందుఁ జేరఁబోయెదవో !
మూఢచిత్తులు నీకు మున్నొసఁగినట్టి
పౌరాణిక విచిత్ర వస్త్రములఁ దాల్చి

మహి విహరింతువు మాఱువేసముల !
నీకాలిచప్పుడు సోఁక దిగులొందు
కంపిల్లు మనుజులఁ గని రహస్యముగఁ
జెఱునవ్వు నవ్వెదో చిన్నారిరాణి ?
నీ మోసగింపులు, నీటక్కుఁదనముఁ
జాలింక! నెఱపుము సఖ్యంబు సకియ.
దయ్యాలముసుఁగేలదాల్చి త్రిమ్మరెదు ?
నీ దొంగవేసంబు నే లాగివైతు;
ఎటువంటి నగుమోము, ఎట్టియందంబు
ముసుఁగుఁజీఁకటిలోన మునిగియున్నదిర !
కవితల్లజుండగు కాళిదాసైన
నీమోహనాకృతి నీదివ్యమూర్తి
నభినుతింపగ లేక హతమనోరథుఁడు
కావలెనని చెప్పఁగా నన్నుబోఁటి
కర్షకకవియెట్లు కడతేరఁ గలఁడు?
అందంబులకు నెల్ల నందంబ వీవు;
నీకు నీవే సాటి నిఖిలలోకమున.
గారడికోలనులోఁ గలకల నగుచు
నిప్పుడిప్పుడె విచ్చు నిందీవరముల
సరిపోలు మురిపాల చక్కనికనులు
సౌందర్యరాజ్య విజయలాంఛనములు.
చెమరించు నీలేఁత చెక్కుటద్దముల
పన్నీరుపువ్వుల పస వెల్లివిరియుఁ
పచ్చిద్రాక్షరసానఁ బలుమాఱు నాన

నైవ మెత్తగనైన పవడంబుచేత
రచియింపఁబడెనో యోరమణి, రసార్ద్ర
మైననీవాతెఱ! యానందదాయ
కంబైన వాసంత కల్యావో నీవు !
జీవరత్నకలాప చిత్రమకుటంబు
ఖద్యోతకాంతులఁ గనుబొమలపైనఁ
గురిపించు. నోపెండ్లికూఁతురా, మనము
ఆశ్చర్య పారవశ్యంబున నీదు
చంద్రశిలా రమ్యశాల, రహస్య
లీల నన్యోన్యముఁ గేలఁగేలూని
విడిపోని మమతల విహరింపలేదె ?
ప్రతిరాత్రి గాఢనిద్రావేళ నీదు
సుఖకర నిశ్శబ్ద చుంబన స్పర్శ
ననుభవించుచు నుందు నలసటదీఱ.
జీవనాంభోధి వీచీమార్గ ముందుఁ
బ్రాణికోటులఁ బరపారంబుఁ జేర్చు
నుడుపంబు నేర్పుతో నడుపంగఁ, బ్రకృతి
నియమించె నిన్ను ; నో నిశ్చలకర్ణ
ధారిణీ! నవమూర్తి ధరియింపు మింక.
విపులపౌరాణిక విపిన సంచారి
ణీ! రుద్రమృత్యువా! నీకు వీడ్కొలుపు.

---

# బిడ్డ : బాటసారి

## బిడ్డ

పై బాటలం బోవు నో బాటసారి!
నిసుగులకును నోట నీరూరునట్లు
దోరగిల్లి పసిండి తీరులొలికించు
పండ్లగుత్తులు వీఁపు పైన వ్రేలాడ
వలసట సోలుచు నరుగుదెం చెదవు.
నీపయనంబింక రేపుమాపులను
ముగియదా యేమి యో ముసలి తాతయ్యా?

## బాటసారి

నీవలె నొకనాఁడు, నిండారఁ బూచి
పచ్చి తావులు చల్లు పన్నీరుపువ్వు
పోల్కి నవ్వుచు నేను బుట్టితిఁ; గాని
పుడమి సంతను నాదు పోలుపునెత్తావి
వెదచల్లి, కారాకు విధమున నొంటి
నేఁగుచున్నాఁడ మాయింటికి నేఁడు
యుగయుగంబుల నాఁటి సొగసైన పసిఁడి
పండ్ల బరువులు వీపు పై మోచికొనుచు.

పలుగ్రహంబులకును బయనంబు చేసి
భవపిపాస హరించు పండ్లుఫలాలు
అలమట పడియైన నార్జించుకొందు.
నెనలేని యైశ్వర్య మెపుడు గడించి
విశ్వసామ్రాజ్యంబు విలుతునో గాని
యంతదనుకను నేను నక్షత్రాళు లరగఁ
దిరుగుచుండెద నోయి మురిపాల బిడ్డ!

బిడ్డ

అట్లైన నిం కెప్పుడలసట కోర్చి
పండ్లగుత్తులు నీవు పైనూఁగులాడ
నీవలెఁ జరియింతు నేను నీబాట.

బాటసారి

చరియించుచున్నావు చక్కనికూన!

బిడ్డ

నీవలె నేనెపుడు నిఖిలవిశ్వంబు
విత్తంబుఁ గడియించి విలుతునో చెపుమ?

బాటసారి

గడియించుచున్నావు; కడకొక్కనాఁడు
నేను బోయినదారి నీవు రాగలవు!



# మేలుకొలుపు

తే-గీ. ప్రత్యూషశ్శాంత నిర్మలాంబరమునందు
నరుణరక్తిమ వ్రాసె జయాంకములనుఁ;
జిమ్మచీఁకటి తెరలను జింపి వైచి
మేలుకొనుమమ్మ! యింకనైన మేలుకొనుము!

తే-గీ. పవలు రేయు నతీంద్రియ స్వప్నములను
గనుచు నవియెల్ల సత్యమంచని తలంతె?
కలలకును వీడుకోలుగాఁ బులుఁగులిపుడు
గానములు సేయుచున్నవి; కనవో? వినవో?

తే-గీ. నిద్రయే జీవనంబని నీకుమున్ను
నూరిపోసిరి మాయలమారు లెవరో!
మచ్చు మందుల నుతకమ్ము విచ్చిపోవఁ
గడపఁ గాల్మెట్టి లేయెండఁ గ్రాఁగుమమ్మ.

తే-గీ. అపయశః పంకిలంబైన యాత్మకన్న
చచ్చుటే కొంత మానరక్షణము సుమ్ము;
పారతంత్ర్య భరంబున బడలిసడలి
యుదవ త్రావుడు త్రావెదో యమ్మ! నీవు?

తే-గీ. కాలగర్భంబునన్ దాఁగి కానరాని
భావిదృశ్యంబు కన్నులఁ బడినయట్లు
నలుదెసలఁ బ్రొద్దువొడుపు నిగ్గులు రచించె
నభినవజగంబు; ముసుఁగెత్తి యరయుమమ్మ.

తే-గీ. కర్మ, విధిచేష్ట, దైవనిగ్రహమటన్న
పిచ్చివేదాంతములఁ బోయెఁ బెద్దప్రొద్దు;
ఆత్మవిశ్వాస సూర్యోదయంబు కెలన
నిద్దురతమంబు కాలొడ్డి నిలువఁగలదె?

# వసంతోదయము



ఏలొకో మావులం జివురులెత్తఁగఁ, గావ్యరమా కరంబులన్
మేలన మాడునట్లు నునునీడలు దేలుచు నందగించు; నే
మూలలనునైనఁ జాల యుపభోగ్యముగా ననిలంబు విచ్చుక్రొం
బూలయనుంగుదావి తడిపుప్పొడి తాఁకుల నామతించెడిన్.

ఎవరికి నెఱుంగరాక యేయింద్రజాలి
కుండు వీచెనొక్క నెమ్మి కుంచెనిపుడు !
చెట్టు చేమలు విలసిల్లెఁ జిత్రగతినిఁ
బువ్వు లాకులఁ బిందెలఁ బుష్కలముగ.
కోకిలాగంతుకులు మావికొమ్మ లెక్కి
యాలపించెదరిప్పు డయాచితముగ
హృదయసంస్పర్శిరాగంబు ! నేనియంత
వారి కాహ్వానపత్రికఁ బంపినాఁడు ?

గఱిక మొదలుగఁ దారకాగణమువఱకుఁ
గలుగుసృష్టి నీరవభాషఁ దెలుపుచుండె
నవనవోజ్జ్వల సుఖజీవనప్రభాత
దివ్యసందేశమును నేఁడు. తెలిసెఁ ! దెలిసె !!

ప్రభువసంతుఁడు నందనవనమునుండి
యాత్రసేయగ భూమిపై కరుగుదెంచె;
నతఁడు విడిసిన తలము లల్లవిగో పచ్చ
నాకుల గుడారముల పట్టణమనఁ జెలంగు.



# ముసలిమాలెత

మిడిమిడి యెండ సోలుచు శమింపని తాపముతోడ నూరుపుల్
వెడలగ డొల్లయై కడుపు వెన్నెముకం గరమంటియుండగన్
బుడిబుడి మిట్టపల్లములఁ బూనికఁ గాలిడఁబోయితొట్రిలం
బడుచు గతి శ్రమన్ ముసలిమాలెత వచ్చుచునుండె నొంటిగన్.

కాలకఠోరసీర మలికంబను ధారుణిదున్న లోతుగం
జాలులు వాఱెనా వళులుసాగి శ్రమాంబులు పిక్కటిల్లి, స్వే
తాలక వృత్తముల్ నొసలికావల నీవల వ్రేల నందు ము
త్యాలవిధంబునం దొరఁగు నాముగివగ్గు తలం జలింపఁగన్.

ఒంటిపూటైన నాఁకటిమంటదీఱఁ
గుడువ నొకకడియన్నంబు గూడకున్కి
నస్థిపంజరమైన దేహంబు గూడ
మోవలేదన సోలును ముసలియవ్వ

దారిద్ర్యదేవత తనరూపుఁగనుపింప
వగ్గువాలకమూని వచ్చెనొక్కొ!
భేతాళునాజ్ఞగావించు పిశాచంబు
పీనుఁగు నొడలింబో వెడలెనొక్కొ!

స్వార్థపరస్వాంతుఁడౌ రాజుచేఁబడి
లావుదూలిన దేశలక్ష్మి యొక్కొ!
సకలవస్తు ప్రదర్శన శాలలో నిడ్డ
మునిమియవధిఁదెల్పు మూర్తియొక్కొ!

యనఁగఁ జేయూఁతకఱ్ఱను నవనినూని
నడువఁజాలక తడఁబడి యడుగులిడుచు
నెండవేడికి మేనెల్ల నెఱియుచుండఁ
జెట్టునీడకుఁ దానల్లఁ జేరవచ్చి ;

నను నచ్చోటనుగాంచి కూలఁబడి ప్రాణంబుల్ వెలింబాఱునో
యన నిశ్చేష్టతనుండి తేఱి కడుదాహంబెత్తె నీరమ్ముఁదె
మ్మను నర్థంబుగ దోసిలింబెదవి డాయంబట్టి చూపింప నం
తను తద్భావమెఱింగి తాళిదళపాత్రంబందు శీతాంబుల్,

కొని తెచ్చియీయఁ బెనుదగ
తనియంగాఁ ద్రావి యలఁతి దఱిఁగినపిదపన్
నను దీనదృష్టిఁ గనుఁగొని
వినయముతో నిట్టులనియె వృద్ధాంగనయున్.

నోటఁదడిలేక మాటాడుదిటములేక
గాసిపడియున్న నను గాంచి కనికరమున
నీరమును దాపి ప్రాణంబు నిలిపినట్టి
నిన్ను నేమని పొగడుదుఁ గన్నతండ్రి!

అని కృతజ్ఞతాసౌరభ మార్ద్రవచన
కుసుమములఁ జల్ల నేనును గుతుకమొంది
యవ్వచరితంబుఁ గనుఁగొను నాసతోడ
నిట్టులంటిని నాదరం బుట్టిపడఁగ.

ఎవ్వరిదాన వీవు? మఱియిచ్చటికిం జనుదెంచుటేల? నీ
కెవ్వరు చుట్టపక్కము లిఁకెయ్యెడకుం జన నిచ్ఛగల్గె నో
యవ్వ సమస్తముం దెలుపుమా యనఁ గన్నులబాష్పపూరముల్
నివ్వటిలంగ నాత్మకథ నెట్టనఁ దెల్పెను గద్గదోక్తులన్.

పడమటి మెట్టదేశములఁ బైరులు పంటలు వానలేమికిన్
వడఁబడియెండి కాటకమువచ్చిన సన్నజనంబు మంటలం
బడియెడి దోమగుంపటుల మాడి దినంబున కొక్కసారియున్
గడికబళంబు లేక కడుకష్టము నొందుచు నుండి రచ్చటన్.

డెల్టాభూములఁ బైరులు
గలవని యచ్చోటిజనులు కౌతుకపడుచున్
వలసలువచ్చిరి ప్రాణం
బులు నిలువం బెట్టు నాస పొంపిరివోవన్.

నాకూఁతురు నాకొడుకును
నాఁకలి యెట్టిదియొ యెఱుఁగనట్టులనన్నున్
సాకుచునుండిరి వేళకు
ఆకో లంబలియొ గలుగు నంతకునిడుచున్.

ముసలితనమునందు ముప్పతిప్పలుగల్గెఁ
దమ్మిచూలివ్రాలు వమ్ముపడునె?
కొడుకుఁగూఁతు మొన్నఁ గ్రొత్తద్వారంబుల
నాతపెట్టి నేన బ్రతికియుంటి.

పండుటాకులురాల్పక పసరులొలుకు
పిన్నకవటల వెదకె పాపిష్టిబ్రహ్మ !
ముసలిముదుకకు సంజీవి మెసవఁబెట్టి
విసముఁదినబెట్టె ప్రాయంపుఁ బిల్లలకును!
క్రుంగుటేరు దెగియుఁ గూలని ముదిచెట్టు
పగిదినయ్యె నాదు బ్రతుకదేమొ !
యెవరికొఱకు మనుదు నిఁకమీఁదనిలలోన
భారభూతమైన ప్రాణమేల ?

అనుచుం బట్టిన నిల్పరాని వెత యాస్యంబందుఁదొలఁకాడదృష్టి నిరోధంబొనరించు బాష్పకణముల్ చెక్కిళ్లపై జాఱ పండిన కేశంబులు వాయుతాడితములై నీరంధ్రఘుర్మాంబు సేచనముంబొందగనార్తమూర్తియయిసంస్తంభించియున్నంతటన్.

వృద్ధనారిదైన్యమీక్షించి మద్ధృద
యాబ్జమొలికెఁ గరుణ యనెడు మధువు;
ఆర్ద్రహృదయమునకు నార్తభావమునకు
నెట్టిపరిచయంబు లెసఁగియున్నొ !
అవ్వకొంతసేపు నట్టులే గూర్చుండి
యేమిదలఁచెనేమొ యేఁగునిచ్చఁ
గట్టుఁదడపుచుండఁ గని నేను బల్కితిఁ
దోడ్పడంగఁ గోర్కెతొందరింప.

కాయముజూడ దుర్బలము కన్నులపాటవముందొలంగె నే
సాయమొనర్ప బంధువులు సైతము లేరట నెట్లు కాలముం
ద్రోయుదువవ్వ? యీకలుపు దుంపలు తీయను సత్తువైన లే
దే యటుగాక నీకడుపు నెట్టుల నింపెద విట్టిపల్లెలన్.

ఎండుటాకుల వెన్నెల పండినటులఁ
బెదవిమూలలఁ జిఱునవ్వు పొదలుకొనఁగ
నవ్వ యిట్లనె నాయనా యైననేమి
పుట్టఁజేసిన దేవుండు పూరియిడునె ?
గొడ్డుకాటకమున బందుగులను జేరి
యదవ త్రావుడు త్రావంగ నాస లేదు ;
అట్టులౌటను ఆకైన అంబలైనఁ
గూలియొనరించి కుడుచుటే మేలునాకు.
కన్నకన్నవారల యిండ్లకడపఁద్రొక్కి
బిచ్చమెత్తుట యన్న నాకిచ్చ లేదు
కాలు సేతులు నున్నంత కాల మొరుల
చేతికూటికి నాసింపఁ జిన్నతనము.

అనవిని యవ్వనైతిక గుణాతిశయంబున కబ్బురంబునొం
ది నెనరుమై వచించితిని నీదగునీతికి సంతసంబు గ
లైను; నిఁకమీఁద నీవెచటికిం జననెంచక ప్రత్యహంబు గై
కొనుము మదీయగేహమునఁ గోరినయట్టుల నుజ్జిగస్నముల్.

అనిన సంతసించి యవ్వయిట్లనె నయ్య
కూలిచూపి నాకుఁ గూడుపెట్టు,
తిరిపెమెత్తి తిన్నఁ దీఱునాయాకలి ?
రమ్ము పల్లెఁజేర జమ్మదీసె.

# పండిత ప్రతిజ్ఞ

ఉ. మొన్నటి పుష్యపంచమికి ముప్పదియేండ్ల వయస్సు చెల్లె నిం
కెన్ని దినంబు లీగురువునింట వసింతు? సమస్తశాస్త్రముల్
తిన్నగ నేర్చుకొంటి "మనతిమ్మయశాస్త్రికుమారుఁ డెంతలో
నున్నతి కెక్కె"నంచు నను నూరిజనుల్ వినుతింతు రెప్పుడున్.

గీ. సగము ప్రాయంబు విద్యావిచారమందె
గడచె; సంసారసౌఖ్యంబుఁ బడయ నైతి;
గొప్పవారింటఁ బెండ్లాడఁ గోర్కె గలదు
గాని దారిద్ర్యదోషంబు కంటకంబు.

గీ. ఎవరి నడిగినఁగాని "మీ కెంతయాస్తి?
పెండ్లికూఁతురి కేనగ పెట్టఁగలరు?
ఇంటిమర్యాద లెఱిఁగి మా హెచ్చు నెంచి
పెండ్లి వేడుక నడుపంగఁ బ్రీతి గలదె?"

చ. అనిమఱియేమొయేమొ మరియాదలుగీదలు దెల్పనోర్పుతో"
వినివిని చీదరించుకొని పెండ్లిపెడాకులు మానుకొంటి; నై
నను జెలికాఁడు నామనమునం దొక కోరిక విత్తు నాఁటి తి
య్యని నుడికారపుందడిని నంకురమెత్తఁగఁ జేసి యిట్లనెన్.

చ. జను లనుకోఁగ విందు; నెలజవ్వని, తాఁకినఁ గందిపోవు మె
త్తని చివురాకుమేను, కనుదమ్ముల లోకము మోహపుచ్చు మో
హనమగు నింద్రజాలమొదో యాడుచునుండు; వివిక్తకాననం
బున నెలయేళ్లకూలములఁ బూఁబొదరిండ్ల వసించునొంటిగన్.

గీ. పేరు "కవిత" యంట, పెద్దలుం బిన్నలు
గారవింపఁ బెంపు గాంచునంట ;
ఇష్టమున్నఁ, గోర్కె లీడేర్పఁ దనకుఁ దా
వరుని సరసహృదయు వలచు నంట !

మ. కులముం జూడదు, డబ్బు గోరదు, మనఃకూలంకషప్రేమతో
వలచుం దాను కురూపి నైన; నెటు నిర్బంధించి కామింప భూ
వలయాధీశునకైనఁ గానిపని; నీ పాండిత్యముం జూపి యా
పాలఁతిన్ లోఁగొను మన్నమాటలు మదిం బూరించెఁ బేరా
సలన్.

గీ. అఖిలశాస్త్రపురాణేతిహాసములను
సంస్కృతాంధ్రకావ్యకలాప సంపుటముల
మూటముల్లెలుగాఁ గట్టి మోసికొంచుఁ
దరలితిని గవితాస్వయంవరమునకును.

గీ జనకుఁ డొసఁగిన దేవతార్చనపుఁ బెట్టె
నంచు చినిఁగిన మడిపట్టుపంచెఁ జుట్టి
చంకఁదగిలించి, వెలిబూది సంచిగూడఁ
బదిలముగ దాఁచికొని దారిఁ బట్టినాఁడ.

సీ. తలయూఁచినపుడెల్లఁ దళతళద్యుతి నింపు
మకరకుండలములు మాకు లేవు;
పాండిత్యమున కనివార్యలాంఛనమైన
కాశ్మీరశాలువఁ గప్ప లేదు;

లలితంపుఁగవ్వులగుండెలు ఝల్లుఝల్లన
గండపెండారంబుఁ గాలఁ దొడుగ;
మునుకొని తనకన్న ముందు బారెఁడు వోవు
బిరుదు పేర్లెవరైనఁ బెట్ట రయ్యొ!
ఐనఁ గానిమ్ము, నా కున్నయంతవట్టు
కేమి లోపంబు లే దెవ రేమి యన్నఁ
గంచుగంటపు వ్రాయసకాఁడఁ గానె?
మిగత భారంబు దైవముమీఁద నిడితి.

చ. అని తలపోయుచుం దుదకు నాకవితాలలితాంగిఁ బెండ్లి యా
డినగతి మోర త్రిప్పి నడ లెక్క సుమాళము సందడింప లోఁ
దొని కెడి భావిభోగపరితోషపుభావన తెప్పలార్చుచున్
వనమునఁ కేగుచుండె మనపండితశాస్త్రి జయాభిలాషతోన్.

చ. చనిచని కొన్నినాళులు వసంతశుభోదయవేళఁ గొండదా
పున దిగఁబాఱువాఁక కిరుపుంతలఁ బూఁబొద లందగించు చ
క్కనివనిఁ జొచ్చి దప్పి నడగాసియుఁ దీఱ జలంబుఁ గ్రోలి చ
ల్లనిపొదరింటనీడఁ బదిలంబుగఁ గూర్కె సుఖంబు చేకుఱన్.

గీ. అంతలోన నెండయారాట మొక్కింత
దొలఁగఁ బూఁతగాలి తోడ వీచె;
కొండసెలలసడులు కోయిలపాటలు
మిళితమయ్యె నెడలు పులకరింప.

మ. చివురాకుల్ దెగమేసిపోతరమునం జెంగించుచున్ దాఁటుచున్
దవుదవ్వేఁగుచుఁ గొమ్ము పుట్టుతఱిఁ బంతలాడి కండూతి వో

వ వడిఁ మున్దల డీలుచుఁ హరిణశాబంబుల్ వినోదించుఁ గే
ళివిహారంబుల నిర్భయంబుగను, వల్లీచ్ఛాయ లాసించుచుఁ.

గీ. అట్టినవమోహనారణ్యమందు నొక్క
మావికొమ్మకు నల్లిన పూవుఁదీవ
తూఁగుటుయ్యేలఁ గూర్చుండి, తునిగి రాలు
విరుల జడిగొట్ట నొకవన్యతరుణి యూఁగు.

ఉ. ఆవలపించుతో యువ్వాలి కొయారము నేర్పఁ గలాపి ప్రేమసం
భావనతోడఁ గుత్తుకనుబయ్యెదమీఁదుగ మూపుఁ జేర్చి పూఁ
దావులఁ జల్లు క్రొవ్వేదతలాపిఁని మోమర మోపి, మెత్తగం
జేవిరితెక్కపై నిమురఁ జెల్వయొడింగనుమోడ్చి హాయిగఁ.

ఉ. కోయిలపాటకత్తె తనకూఁతలతప్పులుంగు దిద్దికోఁ
బాయక యభ్యసించుఁ జెలిపజ్జన పాఠము; గోరువంక క
త్యాయతశిక్షనైన దొసఁగంతయుఁ బోదు; సమర్థుఁడౌ [గురుం
డైయును జక్కఁ జేయఁగలఁడా ప్రతిభాపరిహీనశిష్యులఁ.

మ. అపుడే నిద్దుర లేచి పండితుడు, నయ్యాలూఁగునా లేమ యం
దపుఁజందంబును రూపురేక వెలుఁగొందం గాంచి యూహిం [చుఁబో
ణిపదాబ్జంబుల మ్రొక్కనం దొలఁగ వే నిర్మాలమై పాపముల్
అపురూపం బిటువంటిమూర్తి యని వెయ్యాఱుల్ విలోకిం
చుచుఁ.

గీ. పలుకరింప నెంచి, పలికిన నేమేని
బెడఁద వచ్చు నన్న బెంగతోడ
నీళ్లు నములుకొంచు నెత్తిగోఁకుచు నిల్వఁ
జూచి చూడనట్లు చూచి చెలువ.

ఉ. ఉయ్యేల డిగ్గి పయ్యెదను నోరముసుం గిడి జవ్వనంపులా
గియ్యది యన్నపోల్కిఁ గను లెత్తియు నర్ధనిమీలితంబుగా
నయ్యలినీలవేణి నడయందము దోఁపఁగఁ జెట్టుచాటుకుం
జయ్యనఁ బోయి తేనియలు జాల్కొనఁ బల్కెఁ దెనుంగు
[మాటలన్.

గీ. సిగ్గు పైకొని చెక్కిళ్లు జేవురింప
సగముసగముగఁ బల్కె నాసొగసులాడి
"యతిథులరు, మీకు స్వాగతం బన్న నుడులు
పడెను జెవిలోన విని వినఁబడనియటులు.

గీ. ముగుదమాట సూదిమొన మోపునంతటి
సందుఁ జేయ నళుకు జాఱవిడిచి
పండితుండు పల్కె వనిత! నీవెవతెవు?
ఒంటికత్తె విచట నుండనేల?

చ. అన విని కాంత నేఁ గవితనయ్య! వనాంతరసీమలందు రే
యునుబవ లెప్పుడుం బ్రకృతియుత్సవముం దిలకించుచుంబికాం
గనలు మయూరముల్ సఖులుగాఁ బరిచర్యలుసల్ప నొంటిగన్
దినములఁ బుత్తు జవ్వనముఁ దీరునుదియ్యము శాశ్వతంబుగన్.

మ. కలికీ! యెంతటిదింత! నీవె కవితాకళ్యాణివా? బాపురే!
తెలియం జాలకయుంటి, నీకొఱకు నే దేశాలు పట్నాలు కో
టలు పేఁటల్ గిరులేళ్లు దాఁటుకొని మూటాముల్లె భారంబునన్
దల చెప్పట్టగ బట్టగట్టి విసుగెత్తన్ వచ్చితిం గానకన్.

గీ. నిన్నుఁగూడి ధర్మనియతులఁ బాల్గొనఁ
దలఁచి వచ్చినాఁడ, వలచినాఁడ;
నన్నుఁ ద్రోసిపుచ్చ న్యాయంబె? వైదిక
విధిహితంబుగాఁగఁ బెండ్లియాడు.

గీ. అన్నవేళకు నతిథు లభ్యాగతులును
నింటి కరుదెంచి కూర్చుండ, వంట గింటఁ
జేయ నిల్లాలు లే దని చెప్పలేక
తెగఁబడితిఁ గాంత! యాకొఱ దీర్పు మింక.

సీ. హేమంతమున నైన నేటినీట మునింగి,
మడిదోవతులు పాఁతమైల లుదికి,
యిలు నూడ్చుటాదిగాఁ గల ప్రాఁచిపనులెల్ల
విసుగు వేసట లేక వెళ్లఁబుచ్చి,
దేవతార్చనవేది దీపంబు వెలిఁగించి
బానసంబున వంటపనులఁ దీర్చి,
యిరుగుపొరుగునిండ్ల కేఁగక తమయిల్లు
కనుపెట్టుకొని, దూది పెనఁచి దివ్వె
వత్తులను జేయుటో, లేక వలయువిస్త
రంట్లు గుట్టుటో తడిబట్ట లార్చుటయును

గాక యిల్లాలి కింకొక్క కార్య మున్న?
యట్టిగృహిణీపదంబు నీ కౌను చాన !

సీ. వేద వేదాంగముల్ వివిధపురాణేతి
హాసముల్ నాబుద్ధి నరగిపోయె;
పంచకావ్యాల నేపట్టున నేశ్లోక
మడిగినవల్లింతు నప్పుడపుడె;
ఆత్రేండ్లు పాణినీయము పీల్చి పిప్పిఁ జే
సితి నది నాయందె జీర్ణమయ్యె
వసుచరిత్రంబున వ్యాఖ్యానయుతముగ
శ్లేషభంగుల విమర్శించినాఁడ
కడకుఁ జిన్నయసూరివ్యాకరణ మెల్లఁ
బుటలు మలినంబుగాఁగ నెప్పుడును జదివి
సిద్ధివడిసితి; సమరంబుఁ జిత్తశుద్ధి
తో నుపాసించి పొందితి దొడ్డఫలము.

సీ. శాకుంతలములోన శతసహస్రములుగ
వ్యాకృతిదోషముల్ బయలుపఱతు;
భవభూతిసాహిత్యభాండార మెల్లను
గాసుకుఁ గాకుండఁ గడిగి వైతు;
బాణుని శ్రీహర్షు భారవి ఝాడింప
దొలిదెబ్బకైనను నిలువఁ గలరె?
తిక్కయజ్వకుఁ దలతిక్క మాన్పెద నన్నఁ
దెరపిగా నొకనాఁడు తీఱలేదు;

ఇంక దక్కినవార లదేమి లెక్క
ముక్కుఁ బట్టినఁ బ్రాణంబు మొదలె పోవు;
కాంత! నాకన్న నేర్పరుల్ గలరె చెపుమ?
నేను నను (గూర్చి పొగడుట నియతి గాదు.

గీ. సత్కవి, ప్రబంధ వేంకటేశ్వర విజయ వి
లాసకర్త నామది కెక్కలాగు వ్రాసెఁ
గాని, కొందఱు పాండిత్యగణ్యతావి
హీనతను దాఁచ, రస మని యేడ్చినారు.

చ. అని తనమాటముల్లెలు రయంబున విప్పి నెలంత! పొత్తముల్
గనుమ, యధీతమయ్యెనివి; గ్రంథములెన్ని యొమోయ లేకయిం
టను బరిలంబు చేసితిని; నాశ్రమ మెల్లను జింత చేసి నన్
గనుమ కృపాకటాక్షములఁ గామిని! నీమన సేమి చెప్పుమా!

గీ. తనకుఁ బరమశత్రుఁడైన లేనిఛాందసుం
డింత కెటులో దొరకె; నింతఁతో డ
విడువరాదటంచు వెలఁది సంతోషించి
హాస్య మనుభవింప నభిలషించి.

గీ. ధర్మశాస్త్రమెల్లఁ దనువున జీర్ణించె
నిగమవిధులయందు నిధులు మీరు;
అట్టి లోట దలఁప కెట్టుల నీనాఁడు
కులటతోడిపొందు గోరినారు?

గీ. అనిన విని ఛాందసుం డపు డదరి లేచి
వెలఁది యేమంటివి? నీ వెట్లు కులట వైతి?

బహుపతిత్వము స్త్రీలకు భావ్యమగునె?
ధర్మవైరుధ్య మకట! దాపురించె.

గీ. ఇందుకా నేను బలుపాటు లెల్ల సైఁచి
యింత దూరమ్ము వచ్చుట యెమ్మెలాఁడి!
బ్రహ్మచారిని, బ్రాహ్మణపండితుఁడను
కులటసాంగత్య మేరీతిఁ గోరుకొందు.

చ. అని కపటంబులేనివెత లాననసీమను దేలియాడఁ గా
మిని! కులటత్వ మెట్టులను మేయము నీయెడ నన్నఁ గాంతయుఁ
మనమున నుబ్బుహాస్యరసమాధురి కన్నులఁ జిప్పిలంగ లోఁ
గొని మొగమందు మాయవగఁగూర్చి వచించెఁ జరిత్రమంత
[యుఁ.

సీ. వాల్మీకి ముసలితాపసి యయ్యు నను గూడి
రమణీయకళలఁ గరంచి యేలెఁ;
గాళిదాసుఁడు బిగ్గఁగౌఁగిట లాలింప,
శృంగారభోగనిర్వృతిని గంటి;
భవభూతి పాండిత్యపటిమంబు శాస్త్రస
మ్మతముగ ననుఁగూడి మాడినాఁడు;
భట్టబాణమయూరభారవిప్రముఖులు
దివ్యభూషాపేక్ష దీర్చినారు;
నన్నపార్యుఁడుఁ దిక్కన మున్నగాఁగఁ
దెలుఁగుఁగవు లెల్ల నాముద్దు సలిపినారు;

ప్రాఁతవారల యనుభోగ్యపటిమ సడలఁ
గ్రొత్తగోవాళ్ల నాసించి కూడుచుందు.

చ. అన విని పండితుం డనును నందఱు ముంచిన ప్రాఁతలంజ వ
య్యనుబడుచుందనంబుఁ గనులారఁ జూచెడి ముద్దరాలిసొం
పును,దనుసౌష్ఠవంబు, వలపుంబస, లెట్టులు గాచి యుంచితో
వనిత! శరీరరమ్యతకు బ్రహ్మ వినీతిని గూర్పఁ డేలొకో ?

గీ. అనుచు గ్రంథంబు లెల్లను నట్టె జవిరి
మాటముల్లెగ సవరించి, పొలఁతి! నేను
బోయి వచ్చెద, మనపొందు పొసఁగ దనినఁ
జెలియ చిఱునవ్వు నవ్వుచుఁ జెంతఁ జేరి.

ఉ. ప్రేముడితోడ నాయురము బిట్టుగ నీకవుఁగింటఁ జేర్చకే క్రో
వోమనుధర్మశాస్త్రరత! యూరకపోయెదె యంచుఁ దెచ్చి
ద్రిమస మూని కౌఁగిలిడఁ దేరకుఁ దత్తఱ మందిచూచు చే
మేమొ వచించుచుం గనుల నెత్తక చేతుల నూడఁబీఁకినన్.

సీ. ముద్దుమాటలు వల్క మోము చిట్లించుచు
శబ్దసంస్కారంబు చాలదనును ;
అడవిపూఁదొడవులఁ దొడిగియుండుటఁ గాంచి
యీయలంకృతి లోప మెసఁగెనను ;
మురిపంబు దళుకొత్త మోవి యానఁగఁ బోవ
నెంగిలిరస మంచు నీసడించు ;
బలిమిమై గిలిగింప నులికి శౌరెఁడుదాఁటి
జలిబిలినడలెల్లఁ జెల్లవనును ;

పెట్టరానట్టిసిలుగులఁ బెట్టి చెలువ
యాటపట్టించి చెర్లాట మాడుచుండఁ,
గానసంబున నేడనో కానరాక
మురళిరావంబు వినవచ్చె మోహనముగ.

సీ. పూలగుత్తులఁ గాంచి పునికి ముద్దాడును
బికమనోహరగీతి విన్న మెచ్చు;
సెలయేళ్ల పాటలఁ జెవియొగ్గి యాలించు
రాలుఁబువ్వుల నేరి మాల గ్రుచ్చు;
పొదరిండ్లలోఁ దూటి పొదలయల్లికఁ జూచు
నడవిజింకలతోడ నాటలాడు;
సాంధ్యారుణాంకితజలదఖండముఁ గాంచు
వనరామణీయకమును దలంచు;
మధురరసము తనదు మనమునఁ దోలఁకాడ
లోకమెల్లఁ దేనెపాక మనును;
నిట్టిమృదులహృదయుఁ డెచ్చోటనుండియో
పిచ్చివానిపోల్కి వచ్చుచుండె.

ఉ. ఆతనిఁ జూచి కాంత, తనయంతు నెఱింగినచెల్మికాఁడు సాం
[దా
ధ్యాతపకాంతులం బ్రకృతియందముఁ గాంచఁగ నేఁగుదెంచెఁ;
నాతరుణుం డొకళ్లొకరి యంసమునం జెయివైచి ముగ్ధసం
గీతములన్ రసంబు లొలికింపఁ దలంపులు దీవరింపఁగన్.

గీ. వచ్చి రాఁగ మున్నె వరునిఁ గౌఁగిటఁ జేర్చి
మూఁతపడ్డకనుల ముత్తెసరుల
గతినిఁ బ్రమదబాష్పకణములు చిప్పిల్ల
నొడలఁ బుల్కనారు లుప్పతిల్ల.

గీ. రెండుకీలలు నేకమౌరీతి నిరువు
రొకరొకరి కౌఁగిళులలోన నుండి రపుడు;
వసుధఁ బ్రతిదియుఁ బ్రణయపిపాసతోడ
నొకటినొకటి నాశ్లేషించునొప్పు దోఁచె.

గీ. అనిమిషత్వమునొంది యాయద్భుతంబు
నరయుచుండెను శాస్త్రి నోరంత దెఱచి;
యంతఁ గౌఁగిలి వీడి యాయబ్జనేత్ర
పిన్ననవ్వులు మోమునఁ జిన్నె లొలుక.

ఉ. చాలిక శాస్త్రిగారు! శ్రమ చాల వహించి మదర్థమయ్యయో!
కాలుకుఁ గాలు గొట్టుకొనఁ గాననసీమకు వచ్చి యింత కే
మేలును బొందకే తిరిగి మీపురిఁ జేరుటఁ జూడ నాకునున్
జాలిజనించె; దైవముప్రసన్నముగా, దిఁకఁ బొందు నావుడున్.

గీ. ఈర్ష్య యొకవంకఁ బరిభవ మింకనొక్క
కడను జిత్తమ్ముఁ జుఱచుఱఁ గాల్చుచుండఁ
గటము లదరఁగఁ గనుబొమల్ నటనసేయఁ
బండితుడు పళ్లు బిగఁబట్టి ప్రతినచేసె.

శా. నేనేతిమ్మయశాస్త్రిపుత్రుఁ డయినన్ నిత్యమ్ముఁ గాత్యాయనీ
ధ్యానారూఢహృదబ్జతన్ విధులసద్ధర్మంబులం బ్రత్యుష

స్నానంబుం బొనరింతు నేనిఁ గవితా! సత్యంబుగా నీజిగుల్
నీనాణెంబు నెయారియంచనడలున్ నిర్మూలముం జేసెదన్.

మ. అని కోపంబున మాటముల్లె గొని సంధ్యావందనాపేక్షచే
వనమార్గంబునుబట్టి యేటిదరికిన్ బాండిత్యవాహుండు పో
యిన, నాయిద్దఱు నెచ్చెలుల్ వనవిహారేచ్ఛన్ నదీసైకతం
బునకుంబోయిరిజంటఁబాయకమనంబుల్ దేహముల్ వర్తిలన్.

గీ. సందెచీఁకటిలో నెదో చాయనుండి
పీనులం బడె నశరీరగాన మొందు;
ప్రకృతి నిదురించె నాజోలపాటలోని
తియ్యఁదేనియ లక్కుఱ దీఱ నాని.



THE INDIA PRINTING WORKS, MADRAS, 1924.

## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120012664

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan | INSA | Times of India | Tamil Heritage Foundation |
| CMU-Books | | Indian Express | AnnaUniversity NEW! |
| Sanskrit | | The Hindu | |
| TTD,Tirupathi | | Deccan Herald | |
| Kerala Sahitya Akademi | | Eenadu | |
| | | Vaartha | |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## ఇందులో

### నిన్నటివారా ? రేపటివారా ?

# నిన్నటివారా? రేపటివారా?

ఈ లోకంలో మనుషులు రెండురకాలు
నిన్నటిమనుషులు - రేపటిమనుషులు
మీరు నిన్నటివారా ? రేపటివారా ?
వెలుగు లోకంలోకి ప్రవేశిస్తున్నారా
లేక చీకటిభూమిలో నివసిస్తున్నారా ?

"నాదేశాన్ని స్వార్థానికి ఉపయోగించుకుంటాను"-
అనే రాజకీయ వేత్తవా ?

అయితేమాత్రం ఇతరులమాంసంపై జీవించే చీడపురుగువు !
లేక "నమ్మకంగా నాదేశాన్ని ప్రేమించి సేవచేస్తాను"
అనే దేశభక్తుడివా ?

అలాఅయితే బాటసారుల దప్పిక తీర్చే ఎడారిలోని
నీటి చెలమవే !

ఇతరుల అవసరాలను అవకాశంగాచేసికొని
అధికధరలకు అమ్మి లాభాలుపొందే వర్తకుడివా ?
అలాఅయితే నీవు శిక్షార్హుడవు,
నీ ఇల్లు భవనమైనా బందిఖానా అయినా తేడా ఉండదు !

లేక రైతుకు, సాలివానికి తమతమ వస్తువులను
    తగుధరలకు మార్పిడిచేసి అధికలాభాన్ని ఆశించక
    అందరికీతోడ్పడే నమ్మకస్తుడివా ?
అలాఅయితే నీవు నిజాయితీపరుడవు
నిన్ను పొగిడినా, నిందించినా ఒకటే !

నీవు అమాయకప్రజలను నమ్మించి
    వారి మంచిహృదయాలను చించి
    నీతలపై బంగారు కిరీటంగా ధరించే మతగురువువా ?
అలాఅయితే నీవు గుడ్డినమ్మకస్తుడవు
నీవు రోజంతా ఉపవాసంఉన్నా, రాత్రంతా ప్రార్థించినా ఒకటే !
లేక ప్రజల మంచితనంలో జాతి క్షేమం చూడకలిగే
                                                నమ్మకస్తుడివా ?
అలాఅయితే సత్యమనేతోటలో నీవు మల్లెపూవువు
నీసువాసన మనుషులకందినా, గాలిలోకలిసినా
                                        శాశ్వతంగానే ఉంటుంది !

నీవు సిద్ధాంతాలను అమ్ముకొని
            చాడీలు, నేరాలపై ఆధారపడే పత్రికారచయితవా ?
అలాఅయితే నీవు శవాన్ని భక్షించే రాబందువు !

చరిత్రవేదికపై నిల్చొని పూర్వపువైభవాలను
    ఆచరణపూర్వకంగా ప్రజలకు బోధించే ఉపాధ్యాయుడవా ?
అలాఅయితే కృశించే మానవాళికి ఆశాజ్యోతివి
    గాయపడ్డహృదయానికి ఔషధానివి !

నిన్నటివారా ? రేపటివారా ?

ప్రజల జేబులను దోచుకోవడానికి తప్ప
బయటకి కదలని పాలకుడవా ?
అలాఅయితే జాతి అనే పంటచేనికి కలుపుమొక్కవు !
లేక ప్రజాక్షేమానికి, విజయానికి కృషిచేసే ప్రజాసేవకుడవా ?
అలాఅయితే దేశపు ధాన్యాగారానికి ఆశీస్సువు !

నీ తప్పులు అన్నీ న్యాయం అనీ
నీభార్య తప్పులు అన్నీ అన్యాయం అనీ
భారంవేసే భర్తవా ?
అలాఅయితే కొండగుహలో
చర్మాలు ధరించి జీవించే ఆడవిమనిషివి!

లేక భార్యతో సుఖసంతోషాలను పంచుకొంటూ
విజయమార్గాన నడిచే నమ్మకమైన సహచరుడివా ?
అలాఅయితే న్యాయం, హేతువు, విజ్ఞానాలఎత్తులకు
జాతిని నడిపించే ఉత్తముడవు !

మెదడు బూజుపట్టి కుళ్ళిపోయిన పాతకాలంతో నింపుకొని
తలపై కెత్తుకొని తిరిగే రచయితవా ?
అలాఅయితే కదలికలేని మురికినీటివే !
లేక అంతరాత్మను పరీక్షించుకొని, చెడ్డను వీడి
మంచిని గ్రహించే ఆలోచనాపరుడవా ?
అలాఅయితే ఆకలిగొన్నవారికి ప్రసాదానివి,
దప్పికగొన్నవారికి చల్లనిపానీయానివి !

## న్యా యా ని కి నో రు

అర్ధరహిత, శబ్దపూరిత కవనాలల్లే కవివా?
అలాఅయితే నవ్వుతూ ఏడ్పించి,
ఏడుస్తూ నవ్వించే హాస్యగాడివి!
లేక జీవితానికీ, జీవితసౌందర్యానికీ శాంతిని చేకూర్చే
స్వర్గసంగీతం ప్రసాదించబడ్డ ఆత్మవా?

అలాఅయితే మా అందరికీ దివిటీవి
మా హృదయాలకు తెలిసిన కోర్కెవి,
మా స్వప్నాలకు దైవఅనుభూతివి!

అలా మానవులు రెండువరుసలగా విభజింపబడ్డారు
ఒకవరుస వంగి కృశించి జీవితమార్గాన్ని ఎక్కలేక
పాతాళానికి దిగుతూ పర్వతశిఖరానికి ఎక్కుతున్నట్లు
బాధపడేవాళ్ళు.
రెండవవరుస యవ్వనంతో, రెక్కలపాదాలతో
వెండివీణాతంత్రులగొంతులతో
ఏదో ఆపలేని మాయాశక్తికి లొంగినట్లు
పర్వతశిఖారానికిఅవలీలగా పయనించేవాళ్లు

ఈరెండింటిలో నీవు ఏవరుసలో ఉన్నావు?

ఒంటరిగా రాత్రి నిశ్శబ్దంలో నిన్నునీవే ప్రశ్నించుకో
నిన్నటి బానిసలవరుసలో ఉన్నావో?
రేపటి స్వాతంత్ర్యపురుషులవరుసకు చెందుతావో తీర్పు చెప్పుకో!

# కొన్ని కవితాలు

కవి సోదరులు తాము రచించిన కవితామాలలు
కూర్చిన పద్యగుచ్ఛాలు
కలిపితే నేర్పరితనానికి కళ్లెం వేయవచ్చునని
ఆలోచించి ఉంటే
తమ వ్రాతప్రతులను ఎప్పుడో చించిపారవేసేవారు.
వారి సిరాను గుర్తు తెలియని నూతుల్లో పారపోసేవారు
వారి కలం పాళీలను అశ్రద్ధ అనే చేతుల్లో విరిచేసేవారు!
పరిపూర్ణ వేషధారుల కలాలపై
కవితా ద్రాక్షరసం పొర్లుతుంటే
నా హృదయం దహిస్తుంది.

కవిత్వం చిరునవ్వుకు పవిత్రరూపం
కవిత్వం కన్నీటిని ఆపే నిట్టూర్పు
కవిత్వం ఆత్మలో నివసించే అంతరాత్మ
దానికి పోషణ హృదయం.

అనురాగం దాహంతీర్చే ద్రాక్షరసం
అలాంటి మృదుత్వంలేనిది కవిత్వంకాదు
అది అవుతుంది భయంకరమైన అబద్ధ దేవత,

# న్యాయానికి నోరు

మన ఆలోచనల ముత్యాలు, ఆత్మరత్నాలు
యంత్రాల మోతలుగా
ఫ్యాక్టరీల ఈలలుగా - మారాయి నేడు.

శాశ్వతంలో కలసిపోయిన
ఓ నిజమైన కవులారా
మమ్ముల్ని, మా కవిత్వాలను క్షమించండి.
నేటి ఐహికసుఖాలను ఆశించే కవులం మేం
కవిత్వంకూడా నేడొక అంగడిసరుకు అయింది
అమృత శ్వాసకాక -

కవిత్వం కావాలి చిరునవ్వుకు ప్రతిరూపం
కవిత్వం కావాలి ఆత్మకు సంగీత స్వరం
కవిత్వం చేయాలి హృదయాన్ని పరిపక్వం
కవిత్వం ఇవ్వలేకుంటే అనుభూతిని
అవుతుంది అది అసత్యాల సౌధం.

———

# స్వప్నదేవత

ఆలసి తాళవృక్షానికి తలవాల్చాను
దాడి తర్వాత యుద్ధరంగంలాఉంది ఆ బయలు
రాత్రి తన నిశబ్దపు నల్లనిముసుగు ముడతల్లో
కప్పింది జీవరాసులను-
కనరాని చెయ్యి నా భుజంనొక్కి-నట్లు అనిపించింది
కనురెప్పలు భారంగా ముడతలు పడుతున్నాయి
ఆత్మ శృంఖలాలను తెంచుకొంది,
భూమి ఊగుతోంది-
ఆకాశం వణుకుతోంది-
ఏదో మంత్రశక్తి నన్నావరించింది
మానవు డెన్నడు చూడని
అందాల ఉద్యానవనంలో ఊడిపడ్డాను-

ఆ దేవుడు పంపిన అందాల భరిణలు
సౌందర్య రాసులు - ఆణిముత్యాల్లాంటి కన్యలు
వందల కొలది కమ్ముకున్నారు నాచుట్టు,
ప్రేమ గీతాలను వల్లిస్తూ
బంగారు వీణలను మీటుతూ-
ఇంతలో కనుపించింది అకస్మాత్తుగా
నవరత్నాలు పొదిగించిన బంగారు సింహాసనం.

మెరిసే నగలతో శృంగారించి
రంగు రంగుల దుస్తులతో
రమణీయమైన హొయలుతో
వచ్చి ఆసీనురాలైంది
ఒక అందాలరాణి ఆ సింహాసనంపై-
అంతా నిశ్శబ్దం - అపుడు అంది ఆమె-
"నేను స్వప్నదేవతను
స్వప్న అనుభవాలకు రాణిని
నిన్ను పిలిపించాను
మానవులకు సందేశం పంపడానికి-
స్వప్ననగరం ఒక పెళ్ళి విడిది
పెళ్ళి బట్టలతోనే ప్రవేశం ఇక్కడకు
ఈ నగరం స్వర్గతుల్యం
"ప్రేమ" అనే దేవదూత కాపలా కాస్తుంది
నుదుట ప్రేమతిలకం లేందే లేదు ప్రవేశం
నరులకు ఇలా చెప్పు అంది-
"ఇక్కడ నదుల్లో అమృతం ప్రవహిస్తుంది
పొలాల్లో బంగారం పండుతుంది
పక్షులు ఆకసంలో ఎగురుతూ
దేవదూతలతో కలసి పాడుతాయి సంగీతం.
ఇక్కడి పుష్పాల సుగంధాన్ని వాళ్ళకు అందించు
స్వప్నకుమారుడికే ఈ పసిడి తివాసి బయలులో ప్రవేశం
అని చెప్పు!
మరొక్క విషయం మరవకుండా చెప్పు మనిషికి-

## స్వ ప్న దే వ త

"అందిచ్చాను మనిషికి
ఆనందించమని సంతోష కలశాన్ని
మూర్ఖత్వంతో కాలదన్ని పారబోశాడు దాన్ని
చీకటిరక్కసులు నింపారు
ఆ కలశాన్ని-దుఃఖ రసంతో
ఆస్వాదించాడు మనిషి దానిని ఆతృతతో
మారిపోయాడు తాగుబోతుగా
అయ్యాడు మత్తుకు దాసుడుగా-"

"కలలు కనడమే దేవలోకానికి రహదారి"-అంటూ
నన్ను దగ్గరికి పిలచి, ముద్దిచ్చి-
"స్వప్నలోకంలో కాలం గడపనివాళ్ళు
పగటికి బానిసలని చెప్పు" అంది-

అంతలో అందాల దేవకన్యలు
బారులుతీరి పైకి వెళ్ళారు
మళ్ళీ భూమి ఊగినట్లు
ఆకాశం వణికినట్లు అనిపించి
మెలకువపొర నాపై ఉషఃకాంతులను చిలకరించింది

కళ్ళు తెరవగానే
తాటిచెట్టుక్రింద దుమ్ము దూళిలో
మాగంటి కునుకుతో మేలుకున్నాను
చిరునవ్వుల ఉదయ కిరణాలను తిలకిస్తూ-

"స్వప్న లోకంలో కాలం గడపనివాడు
పగటికి నిజంగా బానిసే" అనే మాటలు
వెలువడ్డాయి నా పెదవుల్లో నుండి.

# ప్రేమంటే-

"ప్రథమ మానవుడు
మనకు ప్రసాదించిన
ప్రకృతి బలహీనత-ప్రేమ"
అంటాడు ఒక ముసలివాడు

"ప్రేమ మన వర్తమానాన్ని
భూత భవిష్యత్తులతో కలిపేది"
అంటాడు ఒక యౌవనం ఉప్పొంగే యువకుడు.

'నరకకూపాల్లో నల్లత్రాచులు కక్కే కఠోరవిషం ప్రేమ,
మంచు బిందువుల్లా తాజాగా ఉంటుంది ఆ విషం.
దాహంలో ఉన్న ఆత్మ ఆసక్తితో త్రాగుతుంది
కాని, మొదటి నిషా తరువాత
తాగేవారు కృశించి, రోగులై మెల్లమెల్లగా చస్తారు"
అంది బాధాకర ముఖంగల ఒక స్త్రీ.

"విషకన్యలు వడ్డించే ద్రాక్షరసం ప్రేమ
గట్టి మనసులను బలపరచి
నక్షత్రాలు చేరడానికి సహకరిస్తుంది ప్రేమ"
అన్నది ఒక అందమైన రోజాబుగ్గల యువతి.

## ప్రేమంటే-

"యౌవనంతో మొదలిడి
గుడ్డి అజ్ఞానంతో అంతమయ్యేది-ప్రేమ"
అన్నాడు నల్లదుస్తులు ధరించి, గడ్డం పెంచిన మనిషి.

"దేవతలు పరికించగలిగేటంత శక్తిని
మనిషికిచ్చే దివ్యజ్ఞానం ప్రేమ"
అన్నాడు మరొకడు నవ్వుతూ-

"కండ్లు కనబడకుండా చేసే దుమ్ము ప్రేమ
హృదయం వణికే కోర్కెలనే చూడగలదు,
మూగ ప్రతిధ్వనినే వినగలదు-"
అన్నాడు ఒక గుడ్డివాడు.

"రగిలే హృదయంలోనుండి వెలువడి
మన పరిసరాలను కాంతిమయం చేసే
మంత్రశక్తి కిరణం-ప్రేమ
ఒక చైతన్యం మరో చైతన్యం మధ్య
చూడశక్తిని కలిగించే అందమైన స్వప్నం-ప్రేమ"
అన్నాడు మురళి వాయించే యువకుడు.

"సమాధిలోని శరీరానికి విశ్రాంతి-ప్రేమ
శాశ్వతపు లోతుల్లో ఆత్మకు శాంతి ప్రేమ"
అన్నాడు ముసలిబడుగు వణుకుతూ.

"ప్రేమ నా తల్లి, తండ్రి
నా తల్లి తండ్రులకుతప్ప మరెవ్వరికీ ప్రేమంటే తెలియదు"
అన్నాడు అయిదేళ్ళ శిశువు.

అందరూ అలా తమ బాధలు-
సంతోషాలు, ఆశలు, ఆశయాలు
ఆధారంగా ప్రేమను వర్ణించారు.

కాని,
ప్రేమఅంటే అదో మాయగానే ఉండిపోయింది.

ఈలోగా ఆలయంలోనుండి ఒక అశరీరవాణి
"జీవితం రెండు భాగాలుగా విభజింపబడింది
ఒకటి కరుడు కట్టినది
మరొకటి రగిలి కాలే అగ్నిజ్వాల

ఆ రగిలే అగ్నిజ్వాలే ప్రేమ"అని పలికింది.
అపుడు నేను ఆలయం ప్రవేశించి ప్రార్థించాను-
"దేవా రగిలే అగ్నిజ్వాలకు నన్ను నెయ్యిగాచెయ్యి
నన్ను పవిత్ర అగ్నికి ఆహారంగా చెయ్యిస్వామి"అని

శాశ్వతత్వం దేన్నీ దాచుకోదు-ప్రేమనుతప్ప
ప్రేమే శాశ్వత కాంతిగనుక.

---

# ప్రపంచమంతా అంతా-

ఓ రూపంలేని మహత్తర శక్తి
మానవుడికి ఇచ్చావు నిరాశాపూరిత సందేశం
కాని ఇది నిజంకాదు
లేకుంటే జీవితానికి అర్థం ఏమి ?
మరణిస్తేనేగాని దొరకని జ్ఞానాన్ని
మనిషి ఎలా గ్రహిస్తున్నాడు ?
ఇప్పుడైనా తెలుసుకున్నావా-
జీవితం ఆత్మకు విసుగు ముసుగు కాదని
లోకంలో జరిగేవన్నీ స్వంత గొప్పలు చాటడం కాదని
ఎలాగో ప్రపంచం సత్యంవైపు నడుస్తూనే ఉందని ?
బలహీనులమైన మేం
నీ నిరుత్సాహపు సందేశాన్ని నమ్మి విన్నాం
అది మాకు చీకటి కవాటం అయింది.
అజ్ఞానం, దుర్మార్గం, నియంతృత్వాలకు
స్పష్టమైన కారణాలున్నాయని-
విజ్ఞాన వికాసాలే అందమనీ
అదే న్యాయానికి ఫలం అని గ్రహించాలి.

మా బలహీనపు మనస్సులు
సుఖ సంతోషాలనే కోరినా

దుఃఖం, పేదరికం, హృదయాలను శుభ్రపరుస్తాయని
ప్రపంచంలోని అన్ని ఇబ్బందులనూ ఎదుర్కొని
ఆత్మ వెలుతురువైపు పయనిస్తోందని తెలుసా ?

అయినా
"అంతు తెలియని మహత్తరశక్తి-
చేతుల్లో మనిషి కీలుబొమ్మ"
అని నీవు చెప్పేదానితో ఏకీభవిస్తాం.

మా హృదయాల్లో నిరాశాబీజాలు నాటినందుకు
నీవు పశ్చాత్తాపం చెందినా
నీ ఉపయోగం మాలిన సలహానే పాటిస్తాన్నాం.

ఓ మహత్తర శక్తీ ! ప్రేమోపాసకులకు చెప్పు
చాడీకోరుల మాటల నమ్మరాదని
బహుశా ! నీవు మాకు నూరిపోసిన సరుత్సాహానికి
ఇది పశ్చాతాపం కావచ్చు !

---

# ఆత్మతో ప్రేమకలయిక

మనుషుల ఆత్మలను
నిద్రాదేవత ఆవరించింది
ప్రేమ ఆత్మను దగ్గరకు తెస్తుంది.
ఆత్రుత దూరంగా లాగుతుంది

మతిమరుపు అనే భూతం
దుప్పటి మడతల్లో దాగి ఉంటుందనే భయంతో
పడకనే వదిలేశాను
నా శ్వాస పదాలను నిశ్శబ్దం చేసి
కాళీ పుటలను కళ్ళముందు ఉంచినందున
పుస్తకాన్నే పారవేశాను
నిద్రమాని ప్రేమ నిరంతరం చెప్పే బోధవిను
రాత్రి అందరిని తన ఒడిలో చేర్చుకొన్నందున
నేను తప్ప మరెవరు వింటారు చెప్పు !

ఉషఃకాంతులతో మేలి ముసుగువేసి
స్వర్గంగా మార్చింది వెన్నెల
బంగారం బరువు కింద కుంగుతున్నాడు మనిషి ;
మంచికి చేరే ఎగుడు దారి ఎక్కలేక
మెక్కలు పట్టుకుంటున్నాడు మనిషి !

### న్యాయానికి నోరు

మరుపు తెరను తొలగించి
నిజాన్ని చూచే శక్తిని ఇచ్చింది జ్ఞాపకం
ఉదయం-తన పట్టువేళ్ళతో లేపింది
నిద్రలో ఉన్న లోకాన్ని-

ఆ కిరణాల కాంతి
జీవితపు ఔన్నత్యాన్ని చాటింది
జీవరాసులు తమతమ నిత్యకృత్యాల్లో నిమగ్నులయ్యాయి.
ఇంతలో పగటి ఇనుపచెయ్యి లేచింది పైకి
అందరు అలసి పోయారు అప్పటికే
ఆశపోతులు పరుగులిడుతున్నారు
పాపాలతో ఫలితం పొందాలని-
బలవంతులు బలహీనుల కష్టంతో బాగు పడాలని-
ఉన్నవారు లేనివారిపై అధికారం చెలాయించాలని !

ఓ ప్రేమా ! జీవితం ఎంత మాధుర్యం, ఎంత అందం !
అది కవిహృదయం లాగ
దయార్ద్రత, వికాసాలతో నిండి ఉంటుంది

ఆహా ! ఎంత కాఠిన్యం జీవితం !
అది నేరస్తుడి గుండెలాగ
భయం, అపకారాలతో కొట్టుకుంటుంది !

---

# నిన్న నేడు రేపు

చూడు ! ఆమె అతని భుజంపై వాలి ఉన్నది
నిన్న నా భుజంపై వాలినది
రేపు మరొకడి భుజంపై వాలుతుంది !

చూశావా ! ఆమె అతని పక్కన కూర్చుని ఉన్నది
నిన్న నా పక్కన కూర్చున్నది
రేపు మరొకడిపక్కన కూర్చుంటుంది !

చూస్తున్నావా ! ఆమె అతని కలశంలోని పానీయం రుచి చూస్తున్నది
నిన్న నా కాలశంలో రుచి చూచింది
రేపు మరొకడి పాత్రలో పాలు పంచుకుంటుంది !

చూసావా ! ఆమె అతనివైపు చూస్తున్నది
ప్రేమపూరిత నయనాలతో
నిన్న అదే ప్రేమతో నావైపు వీక్షించింది
రేపు అలానే మరొకడివైపు చూస్తుంది !

ఆలకించు- ఆమె అతని చెవిలో పాడే ప్రేమగీతాలను
నిన్న ఆ ప్రేమ గీతాలనే ఊదింది నా చెవిలో
రేపు వినిపిస్తుంది వాటినే మరొకడి చెవిలో !

చూడు !- ఆమె అతనిని కౌగలించుకోవడం
నిన్న అలాగే కౌగలించుకొంది నన్ను
రేపు వాలుతుంది మరొకడి చేతుల్లో !

ఎవరో ఈ వింత వనిత ?
ఆమే జీవితం !

# వేయి కళ్ళ రాత్రి

ప్రేమికులను ప్రేరేపించేది రాత్రి !
కవులకు, గాయకులకు ఉత్సాహాన్ని రేకెత్తించేది రాత్రి
ఆశలకు, కోర్కెలకు, జ్ఞాపకాలకు ఆలయం రాత్రి !

రాత్రీ : భయమనే ఖడ్గాన్ని ధరించావు
మెరిసే వెన్నెల నీ కిరీటం
ప్రశాంత, నిశ్శబ్దాలు నీ మేలిముసుగులు
వేయి కళ్ళతో బ్రతుకు లోతులను పరికిస్తావు
వెయ్యి చెవులతో చావు ఏడ్పులను వింటావు
స్వర్గపు వెలుతురు నీ చీకటిలోనుండే ప్రకాశిస్తుంది.
తూయగల, కొలవగల భౌతిక వస్తువులతో
మమ్ముల గుడ్డివాళ్ళనుచేసే మోసగాడు పగలు !

నీ నీలి పరుపు మడతల్లో
ప్రేమికుల జీవితాలకుదొరుకుతుంది శరణం
ప్రేమికులకు నీవు తోడు, నీడ
దిక్కులేని వారిని ఓదారుస్తావు
ఒంటరి వారిని నీలో తలదాచుకో నిస్తావు
నీ అనురాగపు నీడలో కవులు విశ్రాంతి తీసుకుంటారు.
ప్రవక్తల హృదయాలు మేల్కొంటాయి.
నీ కిరీటపు నీడలో ఆలోచనాపరుల విజ్ఞానం అంకురిస్తుంది.

వేయికళ్ళరాత్రి

ఓ రాత్రీ ః నీవు అద్భుతం. ఆశ్చర్య, అందం !
భువికి, దివికి మధ్యలో నిలిచి
మంచుపొగల మేలిముసుగు వేసుకొని
మేఘాల వలువలు ధరించి
సూర్యునితో నవ్వుతూ, పగటిని పరిహాసిస్తూ
విగ్రహాలకు బానిసలుగా
పూజిస్తున్న వారిని హేళన చేస్తున్నావు.
పట్టు పాన్పులపై నిద్రించే మహారాజులపై నీ కోపం
నిస్సహాయుల దోచుకొనే దొంగలపై నీ కాపలా
వేశ్యల బలవంతపు నవ్వులపై నీ ఏడ్పు
నిజమైన ప్రేమికుల కన్నీటిపై నీ చిరునవ్వు
మంచికి నీ కుడిచెయ్యి చూపుతూ
చెడ్డను నీ పాదాలకింద తొక్కడం-చూస్తున్నాను.

———

# చరిత్ర దేశం

ఆ గొర్రెల కాపరి యువతి
అడవి ప్రాంతాల్లో ప్రవహించే
అందాల కొండవాగు ఒడ్డున
ఆలోచిస్తున్నది ఒక గొర్రెలకాపరి వనిత
భవిష్యత్తు తన కళ్ళముందు నడుస్తున్నట్లు.
సూర్యాస్తమయానికి తల నెరిసిపోయిన ఒక ముదుసలి
ఆమెముందు నిల్చొని-
నేను ''చరిత్రను-దేశానికి శాంతి చేకూరుగాక !" అన్నాడు

"ఏం కావాలి చరిత్రా నీ కిప్పుడు ?
ఒకనాడు సస్యశ్యామలంగా వర్ధిల్లుతున్న ఈ లోయ
ఇలా ఉంది ఈనాడు'' అంది
బక్కచిక్కి తన గొర్రెలను
ఎండిపోయే పొలాలను చూపుతూ-
ఆనాటి సారవంతపు పంటభూముల్లో
ఈనాడు పల్లేరు తీగలు, ఉమ్మెత్త పొదలు వెలిసాయి
ఆనాడు పచ్చిక బయళ్ళలో మేసి
పాల వర్షాన్ని కురిపించిన పశుజాలం
ఈనాడు ముళ్ళకంచెల్లో మేసి
గంటెడు పాలైనా ఇవ్వలేకున్నాయి.
"చరిత్రా నీ ముఖం నాకు చూపించకు
దేశాన్ని సర్వనాశనం చేసావు
నీ క్రూరమైన ఖడ్గాన్ని చూస్తే
మరణాన్ని ప్రేమిద్దామనిపిస్తుంది నాకు"అంది
ఆ గొర్రెలకాపరి యువతి

"వెళ్ళు ఈ దేశాన్ని వదలి ఏ పశ్చిమ దేశాలకో
అక్కడ నీకు ఇస్తారు వలసినంత నీడ
దొరుకుతుంది ఆహ్వానం" అంది.
తన ఖడ్గాన్ని ఒరలో దాచుకొని
ప్రేమ పెల్లుబికే తండ్రిలా అన్నాడు చరిత్ర ఆమెతో
"ఓ దేశమా !-నీ కిచ్చినదాన్నే తీసుకున్నాను
నీ కున్నది నీతోటి దేశాలకు ఇవ్వాలిగా మరి !
ఆనాడు వర్ధిల్లిన దేశాలన్నీ
ఈనాడు నీలాగే వాడి, పుష్పించకుండా ఉన్నాయి
నీవు ''క్షీణించడం'' అనేది నిజంగా అవసరమైన నిద్రావస్థ
దానినుండే నీవు పుంజుకుంటావు బలం.
మరణం ద్వారా తప్ప పుష్పం జనించదు మళ్ళీ
విడిపోయిన తర్వాత తప్ప ప్రేమ చిగురించదు ఎన్నటూ"
అంటూ ఆ ముదుసలి ముందుకు నడిచి
''దగ్గరకురా-కరచాలనం చెయ్యి దేవుడిబిడ్డా" అన్నాడు.



కరచాలనం చేసి
కన్నీటి తెరలోనుండి ఆతడిని చూస్తూ
''వెళ్లు, చరిత్రా ఇక నీవు వెళ్లు'' అంది.
''మళ్ళీ మనం కలుసుకొనేవరకు శలవు దేశమా!"
అంటూ మాయమయ్యాడు మెరుపులా చరిత్ర.
తన గొర్రెల ఇంటివైపు మలుపుకుంటూ
అనుకున్నది దేశం తనలో
''మరొక కలయిక అంటూ ఉంటుందా ?"అని.

# పరిపూర్ణమయిన మనిషి

మనిషి పరిపూర్ణత చెందగలడా ?
అంతులేని అంతరిక్షంగా-
హద్దులులేని సముద్రంగా
భావించిన నాడే మనిషి పొందగలడు పరిపూర్ణత.

ఆరని అగ్నిగాను - తీరని వెలుగుగాను
కదలని గాలిగాను - హోరుగాలి తుఫానుగాను
పిడుగుల ఆకాశంగాను - వర్షపూరిత స్వర్గంగాను
పాడే సెలఏరుగాను - మూలిగే నదముగాను
శిశిరంలో ఆకురాలిన మోడుగాను
వసంతంలో చిగురించిన వనంగాను
ఎగిసే శిఖరంగాను - దిగజారే లోయగాను
సారవంతపు భూమిగాను
మండే ఎడారిగాను
ఉన్ననాడే మనిషి పొందగలడు పరిపూర్ణత-
వీటన్నిటినీ అనుభూతిలో పొందగలిగి నప్పటికీ
మనిషి పరిపూర్ణితలో సగం పొందినట్లే.

తన ఆశయాన్ని అందుకోవాలంటే-
మనిషి తల్లిపై ఆధారపడ్డ శిశువుగాను
కుటుంబ బాధ్యతగల తండ్రిగాను
ప్రేమ ప్రవాహంలో మునిగిన యువకుడిగాను
మనిషి గడిచిన కాలంలో సమరం చేసినట్లుగా

## న్యాయానికి నోరు

తన ఆలయంలో భక్తుడిగా
తన జైలులో నిందితుడిగా
రాత్రి చీకటి,-పగటి అశ్లీలతల మధ్యగా
అయోమయంగా ప్రాకులాడినట్లుగా
తన విశ్వాసాల పువ్వుల మధ్య
తన ఒంటరితనపు ముళ్ళమధ్య బాధపడే సన్యాసిని లాగా-
బలహీనత కోరల్లో,
అవసరాల పంజాలో చిక్కిన వేశ్యలా-
చేతకాని తనానికీ, లొంగి పోవడానికీ,
మధ్యన చిక్కిన బీదవాడిలా,
ఆశ, అంతరాత్మల మధ్య
చిక్కుకున్న ధనికుడిలా-
సాయం సమయ ధూళి,
ఉషఃకిరణాల కాంతి మధ్యనవున్న కవిలా-
అనుభూతి పొందగల మనిషి
పొందుతాడు పరిపూర్ణత్వం
ఉంటాడు దేవుడి నీడకు నీడగా !

---

# భవిష్యత్తులోకి -

వర్తమానపు తెరవెనుకనుండి విన్నాను
మానవుడి మంత్రాలను -
అందాల ఆలయంలో ప్రార్థన వినిపించింది
మనిషి గుండె గంట మోత అనిపించింది
భవష్యత్తు వెలుపలనుండి చూసాను
జనసమూహం, ''నిజం'' అనే ఉదయానికి కాచుకొని
ప్రకృతి హృదయాన్ని పూజించడం కనిపించింది !
భవిష్యత్ నగరంలో
అజ్ఞానాన్ని ఓడించి, విజ్ఞానాన్ని గెలిపించే
సూచనలేమీ కనిపించలేదు -
అయినా - ప్రజా జీవిత ప్రవాహం సాఫీగా సాగుతుంది
పంట భూములు పాడిపశువులు సమృద్ధిగా ఉండడం
మనుష్యుల్లో స్నేహం బలపడడం
దారిద్ర్యం సన్నగిల్లడం
దుర్మార్గం కంటికి తారసిల్లక పోవడం
వైద్యుని అవసరం లేకపోవడం -

నాకు స్పష్టంగా కనిపించిది.
భవిష్యత్ నగరంలో ఇంకా కనిపించాయి
పూజారి లేకపోవడం
అంతరాత్మే మహా పూజారి కనుక -
న్యాయవాదులు లేకపోవడం
ప్రకృతే న్యాయవిచారణ చేస్తుంది గనుక -
ఈ సృష్టికి తానే పునాదినని మానవుడు గమనించండం
వర్తమానపు గోడ వెనుకనుండి
రాగల యుగాల రంగస్థలంనుండి
అందాన్ని పెళ్ళికొడుకుగాను
ఆత్మను పెళ్ళికూతురుగాను
జీవితమే మొదటి రాత్రి వరంగాను - చూశాను.

---

# నోరులేని జంతువు

ఒక రోగగ్రస్తమైన కుక్కను చూసాను
ఆ ముసలి కుక్క కళ్ళలో బాధ, అసహాయత
వెలువడుతున్నాయి.
ఆ బాధను గ్రహించి ఓదార్చగలనేమో అని దగ్గరకు వెళ్ళాను.
నన్ను చూచి భయపడి లేవపోయి మళ్ళీపడి
నావంక దీనంగా నిస్సహాయతతో చూచింది ఆ కుక్క.
ఆ చూపుల్లో మానవుడి మాట కంటే, స్త్రీ కన్నీటి గాథకంటే
విదితమైన భాష నాకు కనిపించింది
"ఓ మనిషీ ! నీ దుర్మార్గంవల్ల
నేనిలా రోగిగా పడి ఉన్నాను
మీరు తన్నే కాలి గాయాలనుండి
ఈ పాడుపడ్డ ఆలయంలో తలదాచుకున్నాను -
దుమ్ము, బూడిద మనిషి హృదయంకంటె
సున్నితమైనవి కనుక -
ప్రపంచంలో మీ అన్యాయపు పరిపాలన అంతం అగుగాక !
ఆనాటి నుండి నేటివరకు
నమ్మక విశ్వాసాలకు మారుపేరుగా
చేసాను సేవ మనిషికి
మనిషిని కాపాడాను, మనిషికై తపించాను
యజమాని రాకకై వేచి ఉన్నాను
అతడు రాకుంటే ఏడ్చాను.

అయినా ఆశించలేదు పంచభక్ష్యాలు
వేసిన ఎముక ముక్కలతోనే తృప్తిపడ్డాను
ముసలితనం రాగానే - ఇంటినుండి పారద్రోలాడు మనిషి
అల్లరి పిల్లల రాళ్ళకు గురిచేసాడు కృతఘ్నుడు !

ఓ మనిషీ ! మీరు మనుషులనూ కుక్కల్లాగే చూస్తారు
యౌవనంలో దేశాన్ని రక్షించి
మిమ్ము కాపాడిన సిపాయిలను
వయస్సు మళ్ళగానే మట్టితో సమానంగా నెట్టివేస్తారు -

ఓ మనిషీ ! మీరు ఆడు దానిని అలాగే చూస్తారు -
మిసి మిసి వయసులో ఉన్నప్పుడు
ఆమె అందాలన్నిటినీ దోచుకుంటారు
ఒడలు సడలగానే వద్దు పొమ్మంటారు
ముద్దుల కుప్ప అనుకున్న దాన్ని
మురికి కూపంలో తోస్తారు" -
అంటూ వాపోయింది ఆ నోరులేని జంతువు
మనిషి కృతఘ్నత గూర్చి.
అంతా అర్థంచేసుకున్నట్లుంది
ఆ కుక్క నా చేతగాని హృదయాన్ని.

---

# యుద్ధం

నీవు నా సోదరుడవు
అయినా నాతో చేస్తున్నావు యుద్ధం.
కీర్తికి పదవికి ప్రాకులాడే వారిని సంతోషపరచడానికి
నా దేశంపై దాడి సల్పి
నన్ను బానిసగా చేస్తావా?

నీ రక్తంతో కీర్తినీ
నీ తల్లి కన్నీటితో ఘనతను
కొనే వాళ్ళ కోసం
నీ భార్యా బిడ్డలను విడిచి
పరదేశాల్లో ప్రాణాలు విడవడానికి
ఎందుకు పూనుకున్నావు?

తోటి సోదరులను చంపడం గొప్పా?
అలా అయితే
సోదరులను చంపినవాళ్ళను పూజిద్దాం గుళ్ళు కట్టి.
బాంబుల పొగల్లో ప్రేమికులు
కలిసి ఆలింగనం చేసుకోగలరా?
తుపాకీ మందుగుండ్ల పొగల్లో
కవి అల్లగలడా కవితలు?
భయంతో కంపిస్తున్న రాత్రులలో
గాయకుడు గొంతుక సవరించి ఆలాపించగలడా?

---

# అందాన్ని పూజించు

దేవుడు ఉన్నాడని వాదించే వారితో ఏకీభవించక
అందమే దేవుడని నిరూపించు.
అందం ముందు తపస్సు కావించు.
పాపాలకు పరితపించు.
నీ హృదయానికి అద్దమైన
స్త్రీని చేరుస్తుంది చేరువకు సౌందర్యం.
అందం ఉండదు ముఖంలో -
అందం వెలుగు హృదయంలో.
ఆత్మను ఆకర్షించేది అందం.
పుచ్చుకోవడాన్ని కాక
ఇచ్చుకోవడాన్నే ప్రేమించేది అందం.
అందాన్ని కలిసినప్పుడు
అంతరంగం లోతుల్లోకి చేతులు చొప్పించి
నీ హృదయ రంగంలోకి తీసుకున్నట్టు ఉంటుంది.
సుఖదుఃఖాల కలయిక ఔన్నత్యమే అందం.
నీవు చూడగలిగే అదృశ్యం
అర్థం చేసుకోగల అస్పష్టత

న్యాయానికి నోరు

వినగలిగే మూగతనం
నీలో మొదలిడి
నీ బాహ్య ప్రపంచంలో అంతమయ్యే
పవిత్రాతి పవిత్రమైంది అందం.
అందాన్ని నీ మతంగా భావించు
అందమే నీ దేవతగా పూజించు
నీ కంటికి కనుపించే దేవుడి సృష్టి అందం ఒక్కటే కనుక!

---

# న్యాయానికి నోరు

పేదరికం వెలువరిస్తుంది
జీవితంలోని ఔన్నత్యాన్ని.
ధనం విప్పి చూపుతుంది
అందులోని నీచత్వాన్ని.
దుఃఖం హృదయాన్ని మెత్తపరుస్తుంది.
సంతోషం గాయపడ్డ హృదయాన్ని నయంచేస్తుంది.

దుఃఖాన్నీ, పేదరికాన్నీ, తొలగిస్తే
స్వలాభం, ఆశపోతు తనం తప్ప
మరేమీ వ్రాయని ఖాళీ శిలాఫలకమే
అవుతుంది మానవ జీవితం.

ధనవంతుడు ధనార్జన ఆసక్తితో
న్యాయాన్ని గూర్చి తెలుసుకోలేదు
బలవంతుడు తనగొప్పకై ప్రాకులాడుతూ
నిజాన్ని గ్రహించలేడు
పేదసోదరా! నీవే న్యాయానికి నోరు
జీవితానికి పుస్తకానివి.
నిన్ను పాలించే వారికి నీతి మార్గానివి
నీకు దారి చూపించే వారికి నిజాయితీ స్తంభానివి.

---

# భూమి

కోపాగ్ని జ్వాలల నుండి జన్మించింది భూమి.
హొయలుగా సొగసుగా నడుస్తుంది భూమి
మట్టిలోని మట్టి నిర్మిస్తుంది భవనాలను సౌధాలను
నిలుపుతుంది గుళ్ళను గోపురాలను
రూపొందిస్తుంది పురాణాలను, ధర్మాలను, శాస్త్రాలను
అలసిపోతుంది తన నిరంతర నిత్యకృత్యాలతో భూమి
తన హృదయమండలంలో నుంచి
వెలికి తీస్తుంది స్వప్నాలను, కల్పనలను.
అప్పుడు భూమి నేత్రాలు
మూసుకుపోతాయి నిద్రాభారంతో
అప్పుడు భూమి మాట్లాడుతుంది భూమితో
"నేనే గర్భకోశాన్ని-నేనే సమాధిని
నిరాటంకంగా ఇలాగే సాగుతాను
సూర్య చంద్రులలా ఆరిపోయి
బూడిదగా రాలిపోయే వరకూ" అంటూ.

---

# ఓ కవీ!

కవీ: ఈ జీవితానికే నీవు ప్రాణం
కఠోర యుగాలనే జయించావు!

కవీ! నీ వొక నాడు హృదయాలను పాలించగలవు
అందువల్ల నీ సామ్రాజ్యానికి హద్దులుండవు!
కవీ! నీముళ్ళ కిరీటాన్ని పరీక్షించు
అందులో మొగ్గతొడుగుతున్న
విజయపుష్పం దాగి ఉంటుంది!

కవీ! అర్థంలేని శబ్దాల నినాదానివా నీవు?
అయితే మాత్రం ఏడుస్తూ నవ్వించే సెలయేరువు
నవ్విస్తూ ఏడ్చే కొండ ఛరియవు!

కవీ! జీవితాన్ని ప్రకృతి సౌందర్యంలో విలీనం చేయడానికి
స్వర్గ సంగీతాన్ని ప్రజలకు అందించడానికి
నీ చేతుల్లో కవితావీణను దాల్చిన పవిత్ర హృదయుడివా?
అలాఅయితే మా మార్గానికి నీవు వెలిగే దివిటీవి
మా హృదయాలకు ఆశాజ్యోతివి
మా స్వప్నాల్లో దివ్య దర్శనానివి!

కవీ! నీ ఆత్మ ఎంతపైకి ఎగరగలిగినా
నీవు సంతోష భరితుడవు కావు
కన్నీటి రహొల్లో కప్పబడి ఉంటావు!

# పెళ్ళికలయిక

వివాహం జీవితగద్యం!
అది శ్లోకాలుగాను, సంగీత స్వరాలుగాను మారుతుంది
ప్రేమకోర్కె ముసుగును తొలగించి
హృదయానికి వెలుగు నిస్తుంది!
దేవుడిని కలసినంత సంతోషాన్ని సమకూరుస్తుంది.
రెండు దైవశక్తుల కలయిక
మూడువ శక్తికి జన్మకారణంఅవుతుంది వివాహం
ఒంటరి తనాన్ని నశింప చేసే
రెండు ఆత్మల గాఢమైన కలయిక పెళ్ళి!
అది గొలుసులో ఒకబంగారు ఉంగరం
దాని మొదలు చూపులో
తుది శాశ్వతత్వంలో
ఉంటుంది పవిత్ర ప్రకృతిని ఫలింప చేసే
మచ్చలేని అకాశం నుండి కురిసే నిర్మల వర్షం పెళ్లి
ఇద్దరు ప్రేమికుల పెళ్ళి కలయిక
ప్రేమవృక్షానికి మొదటి పుష్పపు మొదటిఫలం!



విశ్వైకవిస్థాయికి చేరిన కాలీల్ జిబ్రాన్ రచన prophet (ప్రవక్త) ఇందులోని సారాంశం : అల్ ముస్తఫా అనే మహనీయుడు (ప్రవక్త) ఓర్ఫలిస్ అనే నగరంలో పన్నెండు సంవత్సరాలు తన ఓడ రాకకై ఎదురుచూస్తూ, గడిపి ఓడరాగానే తన జన్మ స్థలానికి తిరుగు ప్రయాణం కట్టినప్పుడు, ఆ నగరంలో తాను గడిపిన జీవితాన్ని, పరిచయమైన ప్రజలను తలచుకొని విచారిస్తాడు. తమ జీవితాలకు వెలుగుచూపిన మహనీయుణ్ణి అకస్మాత్తుగా తమను విడిచి వెళ్లవద్దని ఆ నగరప్రజలు ప్రార్థిస్తారు. ఆ "ప్రవక్త" తమనువదలివెళ్లకతప్పదని తెలిసి ఆ పుర జనులంతా "జననమరణాల మధ్య మానవజీవితాన్ని" గూర్చి మీకు తెలిసింది మాకు తెలుపమనికోరితే, ఆయన "ప్రేమించడం, పెళ్లాడడం" నుండి "మతం మరణించడం" వరకు తన ఉద్బోధగా వాళ్లకు చెప్పిన, విషయాలు ఇందులో ఆ యా శీర్షికలక్రింద సులభ శైలిలో తెనిగించి, పాఠకులకు ఆయన అమూల్య ఆదేశాలను అందిస్తున్నాను.

# ప్రేమ

ప్రేమ పిలుపును అనుసరించండి
ఆ మార్గం కఠినమైనా సరే-
ప్రేమరెక్కలు విప్పి ఆహ్వానించినపుడు
చేరండి ఆ నీడలో
అందులో దాగిన కత్తులు తెగినాసరే-
ప్రేమ పలికిన పలుకులు నమ్మండి
ఆశబ్దం మీకలలను తుడిచి వేసినాసరే-
ప్రేమ కిరీటం నిన్ను వరించి నట్లే
బాధలకు కూడాగురిచేస్తుంది.

కంకులకువలె మనలను తనలోనికి తీసుకొని
నులివిచేస్తుంది నగ్నం-ప్రేమ
పొట్టు నుండి వేరుచేస్తుంది ధాన్యాన్ని
విసురు తుంది పిండిగా
వండుతుంది దేవుడికి నైవేద్యంగా
పవిత్రాగ్ని పై మనలను ప్రేమ.

నీ హృదయంలోని రహస్యాలను తెలుసుకొని
నీవు జీవితానికే హృదయం కావాలని
ప్రేమ చేస్తుంది ఈ పనులన్నీ-

కాని భయంతో నీవు
ప్రేమనుండి కోరేదిశాంతి, సుఖమే అయితే
నీ నగ్నతను కప్పుకొని
ప్రేమ కవాటందాటి
ఋతువులు లేని ప్రపంచం లోనికి వెళ్ళడం నయం.
అక్కడనవ్వవచ్చు, ఏడ్వవచ్చు-

ప్రేమ తనను తప్ప మరేమి ఇవ్వదు
తనను తప్ప మరేమి పుచ్చుకోదు.
ప్రేమకుసొత్తులేదు
తానొకరి సొత్తుకాదు
ప్రేమ సర్వస్వం, సంపూర్ణం కనుక-

నీవు ప్రేమించినపుడు
"దేవుడు నాహృదయంలో ఉన్నాడు" అనకూడదు
"నేను దేవుడి హృదయంలో ఉన్నాను" అనాలి.
"ప్రేమను ఒక మార్గాన నడుపుతాను" అనుకోవద్దు
ప్రేమేనిన్నొక మార్గాన నడిపిస్తుంది నీకు అర్హతఉంటే-
ప్రేమకు తనను పరిపూర్ణం చేసుకోవడం తప్ప
మరోకోర్కె లేదు.

నీవు ప్రేమించి, కోర్కెలు తీర్చుకోవాలంటే
ఈ ఆశయాలను ఆదర్శంచేసుకో-
"సెల యేరు కరిగి ప్రవహించి
రాత్రికి సంగీతాన్ని అందించడం-
అతి మృదుత్వంలోని బాధను గ్రహించడం-
ప్రేమనుగూర్చి నీ గ్రహింపుతో గాయపడడం

ఇష్టంతో, సంతోషంగా రక్తం ధారపోయడం-
ఉదయాన రెక్కలు విప్పిన హృదయంతో లేవడం-
మరో ప్రియమైన రోజుకై వందనం చేయడం-
మధ్యాహ్న వేళ విశ్రాంతి తీసుకొని
ప్రేమలోని ఆనందాన్ని మననం చేసుకోవడం-
సంధ్య వేళకు కృతజ్ఞతతో తిరిగి ఇల్లు చేరుకోవడం-
నీవు ప్రేమిస్తున్న వారికై
నీ పెదవుల పై ప్రార్థనాగానంతో నిద్రించడం''

---

# వివాహం

మీరు కలిసి పుట్టారు
మీరు జీవితాంతం కలిసి ఉండాలి
మృత్యువు మీ జీవిత శేషాన్ని తుంచే వరకు
మీరొకటిగా ఉండాలి,

అయితే మీకలయికలో కాళీలు ఉంచాలి,
ఆ కాళీల్లో స్వర్గ మారుతాల నృత్యం చేయనివ్వండి.
ఒకరినొకరు ప్రేమించండి
కాని ప్రేమ బంధాన్ని పెంచుకోకండి.
మీ ఆత్మల తీరాల మధ్య
కదలే కడలిగా ఉండనివ్వండి ప్రేమను.
ఇద్దరి హృదయ కలశాలను నింపండి
కాని ఒక దానిలో నుంచే సేవించండి.
ఒకరికొకరు ఆహారాన్ని ఇచ్చుకోండి
కాని ఒకరి ఆహారాన్నే భుజించకండి.
వేరువేరుగా ఉండి కూడా
ఒకటిగా మ్రోగే వీణా తంత్రుల్లా ఉండండి.
ఇద్దరు కలసి ఆడి, పాడండి. అనుభవించండి
కాని ఎవరికి వారుగానే ఉండండి.

## వివాహం

ఒకరి హృదయం మరొకరికి ఇచ్చుకోండి
కాని ఎవరి ఆధిఖ్యంలోకి కాకుండా-
జీవితపు గుప్పిడి మాత్రమే మీ హృదయాలను
దాచుకోగలదు కనుక-
ఆలయపు స్తంభాల్లా కలసి ఉండండి
కాని మరీ చేరువకు కాదు
మర్రిచెట్టు, రావి చెట్టు
ఒకదాని నీడలో ఒకటి పెరగనట్లు.

---

# సంతానం

మీ బిడ్డలు మీ బిడ్డలుకారు
జీవితపు కాంక్షకే వారు కూతుళ్ళు, కుమాళ్ళు.
మీ ద్వారా వస్తారు కాని, మీనుండికాదు
వారు మీదగ్గర పెరిగినా-మీవారు కాదు.
మీ ప్రేమనువారికి ఇవ్వవచ్చు కాని
మీ ఆలోచనలను ఇవ్వలేరు
వాళ్ళకు తమ ఆలోచనలు ఉన్నవి కనుక-
వాళ్ళ శరీరాలకు మీరు గూడు చూపించగలరు కాని
వాళ్ళ ఆత్మలకు గృహం చూప లేరు.
మీ కలలో కూడా చేరలేని "రేపు" అనే గృహంలో
వారి అత్మలు నివసిస్తాయి గనుక.
వాళ్ళలా మీరు ఉండడానికి ప్రయత్నించవచ్చు
కాని-మీలావాళ్ళను చేయడానికి ప్రయత్నించకండి
జీవితం వెనుకకు నడువదు
నిన్నటితో ఆగదు కనుక.
మీరే విల్లులు అయితే
మీరు వదలిన బాణాలేమీ బిడ్డలు.

---

# ఇవ్వడం

నీకు ఉన్నదానిని ఇస్తే - ఏమీ ఇవ్వనట్లే
నిన్నే ఇచ్చుకోగలిగితే - నీవు నిజంగా ఇచ్చినట్లే.
నీకు ఉన్నవి అనేవి ఏమిటి ?
రేపటికి అవసరం ఉంటుందని
భయంతో సంపాదించి దాచుకున్నవేగా !
మరి రేపు ?
యాత్రికుల వెంట వెళ్ళే కుక్క ఎముక ముక్కను అతిజాగ్రత్తగా
గుర్తుతెలియని ఎడారి ఇసుక దారిలో
దాచుకున్నతీరేకదా రేపు అంటే ?

అవసరపు భయం అంటే ఏమిటి ?
అవసరమేగా !
తీరని దాహం అంటే ఏమిటి ?
బావి నిండుగా ఉన్నప్పుడు దప్పిక భయమేగా !

తమకు ఉన్నదానిలోకూడా
కొందరు ఇస్తారు ఏ కొంచెమో
అదికూడా తమలో దాగి ఉన్న
"గొప్ప" అనే ఆశను తీర్చుకోవడానికే !
దాంతో ఆ దానం కూడా అవుతుంది అపవిత్రం!

## ప్రవక్త

కొందరికి ఉండేది ఏ కొంచెమో అయినా
ఇస్తారు తమకు ఉన్నదంతా.
వీరు జీవితంపై, జీవనధారపై నమ్మకం కలవారు.
వాళ్ళ ధనాగారాలు ఎప్పుడు ఖాళీకావు.

కొందరు ఇస్తారు సంతోషంతో
ఆ సంతోషమే వారికి పారితోషికం -
కొందరు ఇస్తారు బాధతో
ఆ బాధే వారికి బంధం -
ఇచ్చేవారిలో మరికొందరు
ఇవ్వడంలో బాధపడరు
సంతోషాన్ని ఆశించరు
గొప్పకు ప్రాకులాడరు.
అలాంటివారు తోటలో సంపంగి తన సుగంధాన్ని
నలువైపులా వెదజల్లినట్లు ఇస్తారు -

అడిగినప్పుడు ఇవ్వడం మంచిదే
అవసరం అర్థంచేసికొని
అడిగించుకోకుండా ఇవ్వడం అంతకంటే మంచిది.
చేతులు చాచి ఇచ్చేవారికి
తాము ఇవ్వడంకంటే
పుచ్చుకుండేవారిని వెతకడమే
ఎక్కువ సంతోషాన్ని కలిగిస్తుంది -

నీవు ఇవ్వకుండా దాచుకోగలిగేది ఏమైనా ఉందా ?
నీకు ఉన్నదంతా ఒకనాడు ఇవ్వవలసిందే !

కాబట్టి ఇప్పుడే ఇవ్వు -
ఇచ్చే తరుణం నీవే దక్కించుకో !
లేకుంటే నీ వారసులకే మిగులుతుంది. అదృష్టం !

"అర్హులకే ఇస్తాను" అంటావు పలుమార్లు -
తోటలో వృక్షాలు, మందలో పశువులు అలా ఎన్నడు అనవు
తమకు ఉన్నవాటిని ఇవ్వడంవల్లనే అవి జీవిస్తాయి
ఇవ్వకుంటే వాటికి మరణమే శరణ్యం !
పగలు రాత్రులకు నోచుకున్న ప్రతి ఒక్కడు
నీ దానానికి నోచుకోడా ?
జీవిత మహాసముద్రంలో తాగను అర్హుడైనవాడు
నీ చిన్న పిల్లకాలువలో నీటి చుక్కకు అర్హుడుకాడా ?
దానాన్ని పుచ్చుకోవడం కంటే
దానిని పుచ్చుకోవడంలో ఉన్న ధైర్యం, బలం, దాతృత్వం
మరి దేనిలో ఉన్నాయి ?
మానవుల అర్హతను, గర్వాన్ని విప్పిచూడడానికి నీ వెవడవు ?
నీవు ఇచ్చే పరికరానివే కదా ?
నిజానికి జీవితం జీవితానికిస్తుంది.
"ఇస్తున్నాను" అనుకుంటున్న నీవు సాక్షివి మాత్రమే !

పుచ్చుకొనేవాళ్ళారా!
మీరు "కృతజ్ఞత" అనే కాడిని
మీ మెడలకు, ఇచ్చేవారి మెడలకు వేసుకోకండి !
పుచ్చుకొనేదానికి ప్రాముఖ్యం ఇవ్వడం
ఇచ్చేవాడి మంచి హృదయాన్ని అనుమానించడమే !

---

# తినడం తాగడం

గాలి, సువాసన, వెలుగులతో మాత్రమే నివసించలేవు గనుక
నీ తిండికై ఇతర ప్రాణులను చంపడం
అప్పుడే పుట్టిన పసికందు పాలను దోచుకోవడం తప్పదు.
కాని ఆ చంపడం, దోచుకోవడాలను పూజలుగా భావించు!
నీవు ఒక జంతువును చంపునపుడు
నీ ఆత్మలో ఇలా అనుకో -
"నన్ను చంపే శక్తివల్ల, నేనూ చంపబడతాను,
ఉపయోగించుకోబడతాను
నిన్ను నా చేతిలోకి పంపిన న్యాయమే
నన్నుకూడా ఇంకో శక్తివంతమైన చేతిలో ఉంచుతుంది.
"నీ రక్తం నా రక్తం కూడా
స్వర్గ వృక్షం వేళ్ళకు తడితప్ప మరేమీ కాదు-

నీవొక పండును కొరికినప్పుడు
ఇలా అనుకో నీ హృదయంలో -
"నీ బీజాలు నా శరీరంలో నివసించుగాక !
నీ "రేపు" అనే మొగ్గలు నా హృదయంలో వికసించుగాక!
నీ సువాసనే నా శ్వాస
మన మిద్దరం కలసి ఆనందిద్దాం ఋతువులన్నిటిలో.

ద్రాక్షపళ్ళను రసానికై కోసినప్పుడు ఇలా అనుకో -
"నేనూ ద్రాక్షతోటనే
నా ఫలాలను మరవేసి పిండడానికి కోస్తారు.
కొత్త ద్రాక్ష రసంలాగ
నేను శాశ్వత పాత్రల్లో నిలవ ఉంచబడతాను.

---

# పని

పనిచెయ్యడం భూమి ఆత్మతో కలిసి ఉండడమే.
పనిలేకుండడం ఋతువులకు కొత్తవాళ్ళం కావడం
జీవిత మార్గంలో తప్పటడుగు వేయడం.
పని చేసేటప్పుడు -
స్వర శబ్దాలలో గంటలు నిమిషాలు
సంగీతంగా వెలువడే పిల్లనగ్రోవివి నీవు
అన్ని తంత్రులు కలసి పాడుతుంటే
మూగపోయిన నిశ్శబ్దపు తీగలా ఎలా పడి ఉంటావు నీవు ?
పని కఠిన శాపం అని - శ్రమ దురదృష్టం అని
నూరిపోశారు మనకు
కాని, పని చేయడం అంటే
భూమాత కన్న కలలను నిజాలుగా మార్చడమే కాదా ?
శ్రమిస్తున్నప్పుడే నీవు నిజంగా జీవితాన్ని ప్రేమిస్తున్నావు
కృషి, పరిశ్రమలద్వారా జీవితాన్ని ప్రేమించడం
జీవిత రహస్యాలకు చేరువ కావడమే.

పుట్టుకే నుదుటిరాత అనుకుంటే
కనుబొమ్మల చెమటే దాన్ని కడిగివేయగలదు.
జీవితం చీకటి కోన అని చెప్పి
నిన్ను సులభంగా నమ్మించుతూ వచ్చారు.

ప్రవక్త

నిజంగా జీవితం చీకటి కోనయే
శ్రమించాలని కుతూహలం ఉన్నప్పుడు తప్ప -
ప్రతి కుతూహలం అవుతుంది గుడ్డిది విజ్ఞానం ఉన్నప్పుడు తప్ప-
ప్రతి విజ్ఞానం దండుగే శ్రమిస్తే తప్ప-
ప్రతి శ్రమా వృధాయే ప్రేమ ఉంటే తప్ప -
నీవు ప్రేమతో శ్రమించి
నిన్ను ఇతరులతోను
దైవం తోను బంధించుకోగలిగితే తప్ప-
ప్రేమతో పనిచేయడం అంటే ?
నీ అప్తులు ధరించడానికో అన్నట్లు
నీ హృదయంలోనుండి దారాలు తీసి బట్టను నేయడమే
నీ ఆత్మీయులు నివసించడానికో అన్నట్లు
ప్రేమతో ఇంటిని నిర్మించడమే.
నీవు ప్రేమించినవారు ఫలాన్ని అనుభవించడానికి
మృదుత్వంతో విత్తనం వేసి సంతోషంతో పంటను నూర్చడమే.
అన్నిటికి నీ ఆత్మ విశ్వాసం అనే పన్నీరు చిలకడమే -
చలువరాతిని మలిచేవాడు
భూమి దున్నేవాడికంటే గొప్పా ?
ఇంద్ర ధనస్సును బట్టపై మనిషి ప్రతిరూపంగా నేసేవాడు
చెప్పులు కుట్టేవాడికంటే ఘనుడా ?
ఆకాశంలోకి తలనెత్తిన సరిగుడు చెట్లతోను
నేలపై ప్రాకే గరికపోచలతోను
సమానంగా మాట్లాడదా గాలి ?
తన ప్రేమతో గాలి శబ్దాన్ని తీయని పాటగా మార్చినవాడే
నిజంగా ఘనుడు కాదా ?

## ప ని

కళ్ళకు కనిపించే ప్రేమే కాదా పని ! !
పనిని ప్రేమతో నిర్వహించలేక
భారంగా, అయిష్టంగా చేసేపక్షంలో
ఆ పని మానివేసి గుడి ద్వారంముందు కూర్చొని
సంతోషంగా పనిచేసే వారినుండి
భిక్షమెత్తుకోవడం మేలు !
అశ్రద్ధగా అన్నం వండితే
అది అర్ధ ఆకలి తీర్చే విషం అవుతుంది !
విసుగుతో ద్రాక్షపళ్ళను పిండితే
అది మధువులో విషమే !
గానాన్ని ప్రేమించకుండా కిన్నెరల్లా పాడినా
రేయింబవళ్ళ శబ్దాలను వినకుండా
మనిషి చెవుల్లో దూది దోపినట్లే అవుతుంది !

---

# సుఖదుఃఖాలు

మీ సుఖం, ముసుకు తీసిన దుఃఖమే !
ఏ నూతినుండి నవ్వు వెలువడుతుందో
ఆ నూతినే నింపుతాయి కన్నీటి ధారలు -
మన హృదయంలోకి దుఃఖం ఎంత లోతుగా తొలుచుకుంటే
అంత సుఖాన్ని, సంతోషాన్ని నింపుకోగలం అందులో !

మనం ద్రాక్షరసం తాగే పాత్ర
కుమ్మరి ఆవంలో కాల్చినదే కాదా ?
మన హృదయాన్ని రంజింపచేసే వేణువు
కత్తులతో తొలిచి మలిచిన కర్రముక్కే కాదా ?
నీవు సుఖిస్తున్నప్పుడు
నీ హృదయం లోతుల్లోకి చూస్తే
నీకు దుఃఖాన్ని కలిగించినవే
ఇప్పుడు సుఖాన్ని ఇస్తున్నాయని తెలుస్తుంది!
నీవు దుఃఖంలో ఉన్నప్పుడు
నీ హృదయంలోనికి చూడు
నిజంగా నీవు ఒకనాడు ఆనందించినవే
ఈనాడు నీ దుఃఖానికి కారణమని తెలుస్తుంది!

కొందరు దుఃఖంకంటే సుఖమే గొప్పది అంటారు
అవి రెండు వేరుచేయ వీలుగానివి

రెండు కలిస్తే వస్తాయి
ఒకటి నీతో భోజనానికి కూర్చుంటే
రెండవది నీ పడకపై నిద్రిస్తూ ఉంటుంది !

నిజంగా నీవు సుఖదుఃఖాల తక్కెడలా వేలాడుతున్నావు
సుఖదుఃఖాలు లేనప్పుడే నీవు నిశ్చలంగా ఉండగలవు.
తూచినప్పుడే నీ సుఖదుఃఖాల తక్కెడ తట్టలు
పైకి లేస్తాయి - కిందకి వాలుతాయి.

---

# ఇల్లు

నీ విశాల శరీరమే నీ ఇల్లు
ఎండలో పెరిగి
రాత్రి నిశ్శబ్దంలో నిద్రిస్తుంది.
మీ ఇళ్ళకు వేసిన గొళ్ళాలతో
మీరు దాచుకుని కాచుకునేదేమిటి ?
మీ శక్తిని వెలువరించే శాంతి మీకు ఉందా ?
మెదడు శిఖరాలకు నిచ్చెనలైన
జ్ఞాపకాలు మీకు ఉన్నాయా ?
చక్కతోను, రాయితోను కట్టిన
మీ ఇంటి అందాలనుండి
పవిత్ర శిఖరాలకు మీ హృదయాలు చేరగలవా ?

సుఖం అనే పేరుతో అతిథిగా ప్రవేశించి
ఆధిపతిగా మారేదేకాదా మీరు కోరే సుఖం ?
మీ ఇంటి చేతులు పట్టువే అయినా
దాని హృదయం ఇనుము.
నిన్ను నిద్రకు జోకొట్టి
నీ రక్తమాంసాల ప్రాముఖ్యతను హేళన చేస్తుంది.
నిజంగా ఐశ్వర్యాలపై మోజు
ఆత్మ గాఢవాంచను ఖూనీచేసి
స్మశానంలో హేళన చేస్తుంది.

## ప్రవక్త

మీ గృహం లంగరు కారాదు
కావాలి తెరచాప కొయ్య !
గాయాన్ని కప్పే పొర కారాదు
కంటినికాచే రెప్పకావాలి !

ద్వారంలోనుండి ప్రవేశించడానికి
భుజాలు వంచరాదు
కప్పు తగలకుండా ఉండడానికి
తల వంచరాదు
గోడలు పడతాయని
గట్టిగా శ్వాసించడం ఆపరాదు !
బ్రతికినవారికి చచ్చినవారు
కట్టిన సమాధుల్లో మీరు నివసించరాదు!

నీ ఇల్లు పెద్దదిగాను, అందంగాను ఉన్నా
నీ రహస్యాలను అడ్డలేదు
నీ కోర్కెలను దాచలేదు !
విశాల ఆకాశం నీ కొంక మహాసౌధం
దాని ద్వారం వేకువ పొగమంచు
దాని గవాక్షాలు రాత్రి నిశ్శబ్ద గీతాలు!

———

# దుస్తులు

మీ దుస్తులు మీ అందాన్ని ఎంతో దాస్తాయి!
కాని, దాచలేవు మీవికారాన్ని !!
దుస్తుల్లో రహస్య స్వాతంత్ర్యాన్ని కోరినా
మీకు అందులో దొరికేది కళ్ళెము, సంకెళ్ళే !

జీవితపు శ్వాస సూర్యకిరణాల్లోను
జీవితపు హస్తం గాలిలోను ఉంది గనుక
సూర్యుడిని, గాలిని శరీర చర్మంతో కలువనిస్తే
ఎంత బాగుటుంది, బట్టలు అడ్డు లేకుండా !

కొందరంటారు
ఉత్తరదిశ పవనాలే మనకోసం బట్టలు నేస్తాయని :
నిజమే ఆ ఉత్తరపు గాలికి సిగ్గే మగ్గం
సరి చేయబడిన నరాలే దాని నూలు
ఒక్క పెట్టున అడవి దద్దరిల్లేటట్లు నవ్వుతాయి
ఆ పవనాలు నేతపూర్తి కాగానే.

ఆ పరిశుభ్రత అనే కన్నుకు
వినయం అడ్డుదాలు అనిమరువకు ఆ పరిశుభ్రత లేనప్పుడు
కుళ్లెమెదడుకు సంకెళ్ల కాదా వినయం ?
భూమి నీ పాదాలను తాకాలని
గాలి నీ ముంగురులతో ఆడు కోవాలనీ
ఆశిస్తాయని మరచిపోకు.

# కొనడం అమ్మడం

భూమాత ఫలితాన్ని ఇస్తుంది నీకు.
నీ చేతులు నింపుకోవడం తెలుసుకుంటే
నీకు అవసరమంటూ ఉండదు.
భూమి ఇచ్చిన బహుమతుల మార్పిడిలోనే
నీకు కావలసినంత తృప్తి లభిస్తుంది
ఆ మార్పిడి ప్రేమతో, న్యాయంగా జరగకపోతే
అది కొందరి ఆశకు,
మరి కొందరి ఆకలికి కారణం అవుతుంది.

మీరు సంతలో కలిసినప్పుడు
కృషి చేసే కుమ్మరి, కమ్మరి, సాలీ, శ్రామికులతో
భూమి అందించిన ఫలితాలను మార్పిడి చేయండి
కాని కాళీ చేతులతో వచ్చి
వారి మాటలకు మీ శ్రమను అమ్మమనే వారికి
ఇలా చెప్పండి,
"మాతో పొలంలోకిరా
సముద్రంలో దిగు
హలంపట్టు, వలవిసరు
నేల, నీరు మాకులాగే నీకుకూడా
కావలసినంత ఫలితాలను ఇస్తాయి"

# ప్రవక్త

ఆటలు ఆడేవాళ్ళు, పాటలు పాడే వాళ్ళువస్తే
వాళ్ళ నేర్పరితనంతో
మీ వస్తువులను మార్పిడి చేయండి
వారి సంగీతం, నృత్యం,
మీ ఆత్మలకు దుస్తులు, ఆహారంగనుక.
అందరికీ అన్నం దొరకందే
భూమాత ఆత్మ శాంతించదు కనుక
మీరు సంతవదలి వెళ్ళేలోగా
ఎవ్వరూ రిక్త హస్తాలతో వెళ్ళకుండా చూడండి.

———

# నేరం శిక్ష

నీ ఆత్మ పెడదారి పట్టినప్పుడే
నీవు నీకూ, ఇతరులకూ అపకారం చేస్తావు.
నీలోని పరమాత్మ సముద్రం లాంటిది
ఎన్నటికీ మలినం కాకుండా ఉంటుంది.
నీ పరమాత్మ సూర్యుడి లాంటిది కూడా
పురుగుల దారులను ఎరుగదు
సర్పాల రంధ్రాలను అన్వేషించదు.
కాని పరమాత్మ నీలో ఒంటిగాలేదు.
నీలో ఎంతో భాగం మనిషి -
ఇంకా ఎంతో భాగం మనిషికాదు.
నీలో మనిషి కేకాని
పరమాత్మకు తెలియదు నేరం - శిక్షలగూర్చి.
అనేకసార్లు నీవుకానట్లు,
నీలో ఎవరో నేరం చేసినట్లు మాట్లాడుతావు.
నీలో మహాత్ములుకూడా ఎక్కలేనంత ఉన్నత శిఖరాలుఉన్నాయి
నీచాతి నీచులు దిగలేనంత లోతు లోయలూ ఉన్నాయి.
వృక్షానికి తెలియకుండా ఒక్క ఆకుకూడా ఎండిరాలనట్లు
తనలో దాగి ఉన్న అంతరాత్మకు తెలియకుండా
ఎవడూ నేరం చేయలేడు.
ఊరేగింపు వరుసలా మీ అంతరాత్మవైపు కలసి నడుస్తారు.
మీరే బాట, మీరే బాటసారులు

మీలో ఒకరు కిందపడితే
వెనకనున్న వారికి అడ్డు రాతిగూర్చి హెచ్చరికగానే పడతారు.
ముందు వెళ్ళేవారి కారణంగా కూడా పడతారు -
త్వరగా ముందు నడిచి వెళ్ళగలిగినా
వారు అడ్డురాతిని తీసివేయలేదు కనుక.

చంపబడినవాడు తన చావుకు కారణం కాచాజాలడు
అనడానికి వీల్లేదు
దోచుకొనబడినవాడు దోపిడికి కారణంకాదు అనజాలం -
తాము చేయని నేరానికి
తరచుగా అనుభవిస్తారు శిక్షను ఎందరో.
న్యాయాన్ని అన్యాయంనుండి
మంచిని దుర్మార్గంనుండి వేరుచేయలేం.
"పతివ్రత" కాదని మీరెవరైనా భార్యను వేలెత్తి చూపితే
మీ హృదయాన్ని ఆత్మను శక్కెడతో తూచి చూడండి
మీరు "సతీవ్రతులా" అని ?

చెడు వృక్షాన్ని నరికేటప్పుడు దాని వేళ్లను చూడండి
నిజంగా భూమాత మౌన హృదయంలో
మంచి వేళ్లు - చెడ్డ వేళ్లు
ఫలించేవి - ఫలించనివి కలిసి
మెలికలు పడివుంటాయి.
ఏది న్యాయమో ఎవరు చెప్పగలరు ?
పైకి, శరీరంలో మంచిగా ఉండి
ఆత్మలో దొంగగా ఉన్నవాడిపై ఏమి తీర్పు చెప్పగలవు ?

ఇతరుల శరీరాన్ని చంపి
తన ఆత్మను చంపుకున్నవాడికి
ఏమి శిక్ష విధిస్తావు ?
తన చర్యల్లో మోసగాడైనా
తానే మోసపోయిన వాడిపై
ఎలా నింద మోపుతావు ?
తాము చేసిన నేరంకంటే
ఎక్కువగా పశ్చాత్తాపపడినవారిని
ఎలా శిక్షిస్తావు ?
అన్నిటినీ సరిగా చూడందే
న్యాయాన్ని ఎలా అర్థంచేసుకోగలవు?
రాత్రి వంటి తన అల్ప జీవాత్మ
పగలు వంటి పరమాత్మల మధ్య
సంధ్య మసకగా నిలచిన వాడూ
పతనమైపోయినవాడూ
ఒకే వ్యక్తి కాదని ఎలా చెప్పగలం ?
గుడిమూల బిగించిన రాయి
దాని అట్టడుగున పునాది రాయి కన్న
ఉన్నతమైంది కాదని ఎలా చెప్పగలం ?

# చట్టాలు

చట్టాలు తయారు చేయడంలో మీరు ఆనందిస్తారు
వాటిని ఉల్లంఘించడంలో మరీ ఆనందిస్తారు!
సముద్రపు తీరాల్లో ఇసుక మేడలు కట్టి
నవ్వుతూ వాటిని పడగొట్టే పసిపిల్లల్లా !

జీవితమే రాయిగా, చట్టమే ఉలిగా
తమకు తోచినట్టే మలుచుకొనే వారి సంగతేమిటి ?
నాట్యమాడే వారిని అసహ్యించుకునే కుంటివాడి మాటేమిటి ?
కాడిని ప్రేమించే ఎద్దు మాట ?
తప్పి పోవడమే లక్ష్యంగా ఉన్న జింకల మాటేమిటి ?
అందరినీ నగ్నులనీ, సిగ్గులేని వారని పేర్లు పెట్టే
కుబుసం విడువలేని ముసలి త్రాచుపాము మాటేమిటి ?
విందుకు ముందుగా విచ్చేసి, కడుపు పట్టకుండా మెక్కి
"విందులన్నీ సృష్టి విరుద్ధం
తినేవారందరు చట్టాన్ని ఉల్లంఘించేవారు"
అంటూ వెళ్ళేవారి మాటేమిటి ?
వీళ్ళంతా కూడా సూర్యరశ్మి ముందు నుంచుంటారు,
కాని వాళ్ళ వీపులు సూర్యుడి వైపు ఉంచి -
అని తప్ప మరేం చెప్పగలం !
వాళ్ళకు కనపడేది వాళ్ళ నీడలే ?
వాళ్ళ నీడలే వాళ్ళ చట్టాలు !

వాళ్ళకు నీడలు పరచడం తప్పు
సూర్యుడంటే అర్థ మేమిటి?
చట్టాలను గమనించడమంటే
వంగి తమ నీడలను గుర్తించడమే కదా ?
కాని నీవు సూర్యుడికి ఎదురుగా నడిస్తే
ఎటువంటి రూపులు చూడగలవో తెలుసా ?
గాలికి ఎదురుగా పయనిస్తే
గాలి నిన్నెట్లా నడిపిస్తుందో తెలుసా ?

ఎవరి చట్టాలు నిన్ను బంధించలేవు
నీ మెడపై కాడిని
ఇతరులకు హాని లేకుండా విరచగలిగితే
ఇతరుల శృంఖాలపై పడకుండా నాట్యమాడగలిగితే
నీవు భయపడవలసిన చట్టాలు ఏమిటి ?
ఇతరుల దారిలో పడవేయకుండా
నీ బట్టలు చించి పారవేస్తే
నిన్ను ప్రశ్నించేదెవరు ?

మీరు ఢంకా శబ్దం ఆపవచ్చు
వీణా తంత్రుల వదులు చేయవచ్చు
కాని కోకిల కంఠాన్ని ఆపమని శాసించగలరా ?
మీకై మీరే కావించుకున్న అన్యాయపు చట్టాలను
సముద్రంలోని నీరంతా పోసి కడిగినా శుభ్రపరచగలరా ?

---

# స్వేచ్ఛ

శాధిస్తున్న నియంతకు బానిస కొలువు చేసినట్లు
మీరు స్వేచ్ఛను కాడిగా మెడకు వేసుకొని
కొలువు చేస్తున్నారు.
బంధాలు లేని పగళ్ళు
కోర్కెలు, దుఃఖాలు లేని రాత్రుళ్ళు
గడపగలిన నాడే
మీరు నిజమైన స్వేఛ్ఛను అనుభవిస్తారు.
అవగాహన ఉదయించేటప్పుడు
మీమధ్యాహ్న సమయానికి కట్టుకున్న
గొలుసులను తెంచుకొంటే
దుఃఖ బంధాల రాత్రింబవళ్ళను
ఎలా అధిగమించ గలరు ?

గొలుసుల లంకెలు ఎండలో మెరిసి
కళ్ళు మిరిమిట్లు గొలిపినా
నిజంగా ఈ గొలుసులో ఒక గట్టి కొలికే మీ స్వేఛ్ఛ!

నియంతను గద్దె దించాలంటే
మీ హృదయంలో కట్టుకున్న
అతని గద్దెను ముందు కూల్చాలి.

స్వేచ్ఛ

మీ హృదయంలో నియంతృత్వం లేకుంటే
స్వేచ్ఛా జీవులను నియంత ఎలా పాలించగలడు ?
భయం యొక్క పీఠం
ఇతరుల చేతుల్లో కాక
నీ హృదయంలోనే ఉంటే
దాన్ని ఎలా పారద్రోలగలవు ?
నీవు కోరినది, భయపడినది
అసహ్యించుకున్నది, నిరంతరం వాంఛించేది
వెంబడించేది, తప్పించుకునేది - ఇవన్నీ
నిన్ను అర్ధాలింగనం చేసుకొని
నీలోనే కదులుతూ ఉంటాయి!
నిన్ను అంటుకున్న వెలుగు నీడల జంటల్లా
నిన్ను అటుఇటు లాగుతూ ఉంటాయి.

నీడతగ్గగానే మిగిలిన వెలుగు
మరో వెలుగుకునీడ అవుతుంది
అలాగే నీస్వేచ్ఛ తన సంకెళ్ళను తెంచుకోగానే
మరో గొప్ప స్వేచ్ఛకు సంకెళ్ళుగా తయారు అవుతుంది!

---

# హేతువు-గాఢ వాంఛ

నీ వాదన, తీర్పు. గాఢ వాంఛాలు
నీ ఆకలితో పోరాడే యుద్ధరంగమే.
నీ ఆత్మ?
సముద్ర యానం చేసేనీ ఆత్మకు
వాదన చుక్కాని,
మోహం తెరచాప.
చుక్కాని ఇరిగినా
తెరచాప చిరిగినా
నడి సముద్రంలో దారి తప్పద మో
నావ నీటిపై నిలిచి పోవడమో జరుగుతుంది.
అయితే నీ అంతరాత్మకు
శాంతినిచేకూర్చా లంటే
నీలోని నహజ గుణాలను నీవు ప్రేమించి
సన్మార్గంలో నడవ కలిగి ఉండాలి.
ఒంటిగా పరిపాలించే వివేచన
నిర్బంధించే శక్తి
తోడులేని మోహం
తనను తానేకాల్చి నశింపచేసుకునే అగ్నిజ్వాలం.

మోహమంత ఔన్నత్యానికి
వివేకాన్ని నీ ఆత్మ కౌగిలిగి ఉండాలి.

అకలి, తీర్పు నీ ఇంట విడిదిచేసిన ఇరువురు అతిధులు!
ఇరువురినీ సమానంగా గౌరవించాలి
ఏ మాత్రం తేడా చూపినా
ఇరువురి ప్రేమ విశ్వాసాలను కోల్పోతావు.

కొండల నడుమ చల్లని నీడల్లో విశ్రమించినపుడు
పచ్చికబయళ్ళతో ప్రశాంతాన్ని పంచుకుంటున్నప్పుడు
నీ హృదయం నిశ్శబ్దంగా
"భగవంతుడు వివేకంలో విశ్రమిస్తాడు" అనాలి.
తుఫానులు వీచి, పెనుగాలి అడవులను కదలించేటప్పుడు
ఉరుములు, మెరుపులు ఆకాశపు రాచఠీవిని చాటుతున్నపుడు
నీ హృదయం "భగవంతుడు గాఢవాంఛలో కదులుతాడు"
అనాలి.

నీవు భగవంతుడి ఆచరణలో శ్వాసవు
ఆతని అడవిలో ఆకువు కనుక.
నీవుకూడా హేతువులో విశ్రమించి
గాఢవాంఛలో కదలాలి.

o—o

# బాధ

నీ అవగాహనాశక్తిని కప్పి ఉన్న
గవ్వ చిట్లడమే నీ బాధ!
సూర్యరశ్మికై పండులోని గింజ హృదయం పగిలినట్లే
నీవు బాధను తెలుసుకోవాలి.
నిత్యం సాక్షాత్కరించే జీవిత అద్భుతాలను చూడగలిగితే
ఆనందంకన్న -
నీకు కలిగే బాధ ఆశ్చర్యదాయకం కాదు -
పంటచేలు ఋతువులన్నిటినీ స్వీకరించినట్లు
హృదయ ఋతువులను నీవు భరించాలి.
చాలావరకు నీ బాధలు నీవు తెచ్చుకున్నవే
నీలోని వైద్యుడు నీ రోగాన్ని మాన్పడానికి
ఇచ్చే చేదు మందే ఆ బాధ -
నీ పెదవులు మండినా
వైద్యుడిపై నమ్మకంతో
ప్రశాంత చిత్తంతో సేవించాలి! ఆ ఔషధాన్ని
ఆ మందు పాత్ర సృష్టికర్త తన పవిత్రమైన కన్నీటితో
తడిపి తయారుచేసిందే కనుక!

o — o

# ఆత్మ జ్ఞానం

రాత్రి పగళ్ళ రహస్యాలు
నీ హృదయానికి తెలుసు.
నీ హృదయసమాచారాన్ని వినడానికి
నీ చెవులు ఆతృత చెందుతాయి.
నీ ఆలోచనల్లో తెలిసినదాన్నే
మాటల్లో గ్రహించగలవు.
నీ స్వప్నాల నగ్న శరీరాలను
నీ చేతులతో తాకగలవు.
అంతర్గతంగా ప్రవహించే జీవనవాహినిలా
నీ ఆత్మ కెరటాల్లా లేస్తూ, పాడుతూ సాగాలి సముద్రంవైపు!
అనంతమైన అఘాతాల్లో దాగిన
నిధులను అప్పుడే చూడగలవు నీ కళ్ళు.
ఆ అగోచర నిధులను తూచడానికి తలపెట్టకు.
ఆత్మ అంతు, హద్దులులేని మహాసముద్రంలాంటిది గనుక!
నీ గ్రహణశక్తిని కాలమానాలతో కొలువకు
"నేను సత్యాన్ని కనుగొన్నాను" అని ఎప్పుడు అనకు.
"నేనొక సత్యాన్ని కనుగొన్నాను" అని మాత్రమే అనాలి.
"ఆత్మ మార్గాన్ని కనుగొన్నాను" అనకు
"ఆత్మ నడుస్తున్న మార్గాన్ని చూశాను" అని చెప్పు
ఆత్మ అన్నిమార్గాలలో నడుస్తుంది కనుక!
ఆత్మ ఒక సన్నని, చక్కనిదారిలో నడవదు
ఒక మొక్కలా పెరగదు, తీగలా పాకదు.
లెక్కలేని రెక్కల పద్మంలా వికసిస్తుంది ఆత్మ!

---

# బోధ

మీ తెలివిలో మగత నిద్రలో దాగినదాన్ని తప్ప
కొత్తవిషయాన్ని ఎవరు మీకు తెలియచేయగలరు ?
గుడి నీడల్లో నడిచే బోధకుడు
అనుచరులకు తన తెలివిని ఇవ్వడు
తన ప్రేమ విశ్వాసాలను మాత్రమే అందిస్తాడు.
గాయకుడు రాగ, తాళ, లయ విన్యాసాలను
వినిపించగలవాడే కాని
వాటిని ఆకట్టుకొనే చెవినిగాని,
ప్రతిధ్వనించే కంఠాన్నిగాని
మీకు ఇవ్వలేడు.
నిజమైన బోధకుడు
తన జ్ఞాన క్షేత్రంలోనికిగాక
నీ మనోప్రాంగణానికి దారి చూపిస్తాడు –
తమ ఊహల రెక్కలను
ఇతరులకు ఎరువు ఇవ్వలేరుకనుక!

---

# స్నేహం

స్నేహితుడు అంటే
మన "అవసరాలకు జవాబు" అని అర్థం.
ప్రేమతో విత్తి, ధన్యవాదాలతో నూర్చే క్షేత్రం స్నేహం.
అతడు నీకు అండ, ఆదరణ
ఆకలితో చేరి శాంతిని పొందుతావు కనుక.

స్నేహితుడు తన హృదయాన్ని విప్పి మాట్లాడినప్పుడు
"లేదు" అనే భయం మనకు రాదు.
మనంకూడ "అవును" అనేదాన్ని దాచం.
మాటలతో పనిలేకుండానే
స్నేహితంలో అన్ని కోర్కెలు ఆలోచనలు,
మౌనంగా పంచుకుంటాం.

ఎక్కేవాడికి కిందనుండి పర్వత శిఖరం కనుపించేలాగే
మిత్రుడిలో నీవు ప్రేమించేది
స్పష్టంగా అతను లేనప్పుడు కనిపిస్తుంది –
అందువల్ల అతని వియోగానికి నీవు విచారించకు.

ప్రవక్త

ఆత్మ లోతుల్లోకి పోవడం తప్ప
స్నేహంలో మరిఏలా అపేక్ష ఉండరాదు.
ప్రేమను కాక మరి దేన్నో కోరే స్నేహం
స్వలాభాలకు విసిరే వల అవుతుంది!
నీలోని మంచిని స్నేహితుడికి అందించు.

స్నేహం కాదు సమయాన్ని చంపడానికి
అది సమయాన్ని సజీవం చేయడానికే!
స్నేహితుడు మన అవసరాలను నింపాలి
కాని మన ఖాళీలను కాదు!
స్నేహపు మాధుర్యంలో నవ్వుల పువ్వులు విరియాలి
సంతోష పరిమళాలు పంచుకోవాలి!

---

# మాట్లాడటం

ఆలోచనలతో సంబంధం తెగినప్పుడే మాట్లాడుతాం
హృదయంలోని ఒంటరితనంలో నివసించలేనప్పుడే
పెదవులపై నివసిస్తాం-
శబ్దం ఒక వినోదం, కాలయాపన కనుక.
మాట్లాడటంలో ఆలోచన సగం ఖూనీ అవుతుంది.
ఆలోచన రోదసి పక్షి
మాటల పంజరంలో రెక్కలు విప్పగలదు కాని ఎగరలేదు
అనేకులు ఒంటరితనపు భయంతో మాట్లాడటం జరుగుతుంది.
ఒంటరితనపు నిశ్శబ్దం
తమ హృదయాల నగ్నసత్యాన్ని తెలుపుతుంది
కొందరు తెలుసుకోకుండా, అర్థంచేసుకోకుండా
ఒక్కొక్కప్పుడు కొన్ని నిజాలు చెపుతారు.
కొందరిలో నిజం ఉంటుంది కాని మాటల్లో వెలిబుచ్చరు.
అలాంటివారి హృదయపంజరాల్లో
రాగతాళ విన్యాసాలతో నిశ్శబ్దంగా ఆత్మ నివసిస్తుంది!

నీవు మిత్రుని కలిసినప్పుడు
నీలోని ఆత్మ పెదవులను కదలించనియ్యి
నాలుకకు దారి చూపనియ్యి
నీ కంఠంలోని శబ్దాన్ని ఆతని చెవిలోని చెవి లోపలికి పోనియ్యి
ద్రాక్షరసపు రుచిని తలపోసుకుంటున్నట్లు
ఆతని ఆత్మ నీ హృదయ సత్యాన్ని
తనలో నింపుకుంటుంది
రంగును మరచినతర్వాత పాత్రకురూపంలేనట్లు !

# కాలం

కొలతలేని, కొలవలేని కాలాన్ని నీవు కొలుస్తున్నావు.
నీ నడవడికను, నీ ఆత్మను కూడా
గంటలు, ఋతువుల ప్రకారం సర్దుకొని నడిపిస్తావు.
కాలాన్ని నదిగాచేసి
గట్టున కూర్చొని ప్రవాహాన్ని తిలకిస్తావు
అయినా నీలోని "కాలం లేమి" కి
జీవితంలోని "కాలరాహిత్యం" తెలుసు।

నిన్న ఈనాటి జ్ఞాపకమనీ
రేపు ఈనాటి స్వప్నమనీ తెలుసు.
ప్రేమలాగే కొలవడానికి, విభజించడానికి
వీలుకానిదికాదా కాలం ?
నీ ఆలోచనలో కాలాన్ని
ఋతువులుగా కొలవాలనుకుంటే
ప్రతి ఋతువు మిగతా ఋతువులను కౌగిలించాలి-
జ్ఞాపకాలతో భూతకాలాన్ని
అపేక్షతో భవిష్యత్తును
ముంచెత్త నీ ఈ రోజును!

---

# మంచి చెడు

నీలోని మంచిగూర్చి మాట్లాడవచ్చు
చెడ్డనుగూర్చి చెప్పరాదు.
చెడ్డ అంటే ఏమిటి
ఆకలి దప్పులకు లోనైన మంచితనం కాక?
నిజంగా మంచికి ఆకలివేసినప్పుడు
చీకటి లోయల్లోకూడా వెతుకుతుంది ఆహారాన్ని.
అది దప్పికగొన్నప్పుడు
నిర్జీవ జలాలనుకూడా త్రాగుతుంది!

నీవు నీతో ఏకంగా ఉన్నప్పుడు నీవు మంచిగా ఉన్నట్లు-
నీవు నీతో సమైక్యం కాకపోయినా నీవు చెడ్డ కాదు.
పంపకాలుపడిన ఇల్లు వేరుపడిన గృహమేకాని
దొంగలకొంప కానట్లు-
చుక్కాని లేని నౌక అపాయకరమైన జలాల్లో
దారితప్పి తిరగవచ్చు కాని నేలకు మునగనట్లు.

నిన్నే సమర్పించుకో ప్రయత్నిస్తే నీవు మంచివాడవు.
స్వలాభాన్ని కోరినంతమాత్రాన నీవు చెడ్డకాదు.
నీవు లాభాన్ని కోరినప్పుడు
భూమిలోనికి చొచ్చుకొని
రొమ్ములను పీల్చుకొనే వేరువు మాత్రమే-
"నాలాగే పండి అందరికీ ఆనందాన్ని పంచిపెట్టు" అని
ఫలం వేరుకు చెప్పగలదా ?
వేరుకు పుచ్చుకోవడంలాగే
పండుకు ఇవ్వడం అవసరం కనుక – ।

వాక్కులో చైతన్యం ఉన్నప్పుడు నీవు మంచివాడవు
నాలుక అర్థంలేకుండా వదరునప్పుడు
నిద్రించినా నీవుకాదు చెడ్డవాడవు.

నీ గమ్యానికి ధైర్యంగా అడుగులు వేస్తే నీవు మంచివాడవు.
నీవు కుంటుతూ వెళ్ళినా కాదు చెడ్డవాడవు.
కుంటేవాళ్ళుకూడా వెనుకకు వెళ్ళరు కనుక –
కాని మీలో బలవంతులు, వేగంగా నడిచేవాళ్ళు
కుంటివాళ్ళముందు, దయచూపిస్తూ కుంటిగా నడవకండి !

అనేకవిధాలుగా మీరు మంచివాళ్ళు
కాని మీరు మంచి కానంతమాత్రాన చెడ్డకాదు –
మీరు సోమరితనంగా తారాడడం మాత్రమే !
జింకలు తాబేళ్ళకు వేగాన్ని నేర్పలేకపోవడం విచారకరం ।
స్థూలమైన ఆత్మను కోరడంలో ఉంది నీ మంచి
ఆ కోరిక మీ అందరిలో ఉంది
అయితే కొందరిలో ఆ కోరిక గిరుల రహస్యాలను,

తరుల సంగీతాలను మహాసముద్రంలోకి
అతివేగంగా తనతో చేర్చుకొని ప్రవహించే కొండవాగు.
కొందరిలో అది సమతల భూమిపై పారుతూ
వంకర టింకరలతో తీరాన్నిచేరే పిల్లకాలువ.
ఎక్కువ కోరేవారు
"మీరెందుకింత నిదానంగా పడుతూ లేస్తూ నడుస్తున్నారు"
అని తక్కువ కోరేవారిని అడగకండి.
నిజంగా మంచివారు నగ్నంగా ఉన్నవారిని
"మీ దుస్తులేవి" అని అడగరు!
గూడులేని వారిని "మీగృహమేది" అని ప్రశ్నించరు:

o —— o

# ప్రార్థన

ఆపదల్లో అవసరాల్లో ఉన్నప్పుడే ప్రార్థిస్తారు మీరు
ఐశ్వర్యాలను అనుభవించేటప్పుడూ
సంతోషసమయాల్లోకూడా ప్రార్థించే దెన్నడో !
ప్రార్థన అంటే, నీ ఆత్మను విశాలపరచడమే కాదా ?
చీకటిని నీ సుఖానికై రోదసిలో కుమ్మరిస్తే
నీ సంతోషానికి నీ హృదయ ఉషస్సును దొర్లించాలి
నీ ఆత్మ ప్రార్థనకు పిలిచినప్పుడు
ఏడుపు తప్పకపోతే
నీవు నవ్వేవరకు ములుకోలుతో పొడవాలి!

ఎన్నడు కలవని వారిని నీవు ప్రార్థించే సమయంలో తప్ప
మరెప్పుడు కలవగలవు ?
అట్టి సత్సంగానికే ఆలయానికి వెళ్ళాలి.
అడగడానికి వెళ్ళితే నీకు లభించదు
లొంగడానికి వెళ్ళితే జయింపలేవు.
నీవు ఇతరులనుండి మంచిని అడుక్కోడానికే వెళ్ళినా
వినేవారుండరు
అందుకని ఆలయంలో అదృశ్యంగా ప్రవేశిస్తే చాలు.

## ప్రార్థన

మాటలతో ఎలా ప్రార్థించాలో నీకు నేర్పలేను
నీ పెదవులద్వారా పలికినప్పుడు తప్ప
దేవుడు ని మాటలు వినడు.
తరుల, గిరుల, సాగరాల ప్రార్థనలను నీకు నేర్పడం వీలుకాదు.
కొండల్లో, అడవుల్లో, సముద్రాల్లో జనించిన నీవు
వాటి ప్రార్థనలను నీ హృదయంతో దర్శించగలవు.
నిశ్చలరాత్రిలో వింటే వాటి నిశ్శబ్దపు పలుకులు
ఇలా వినిపిస్తాయి -
"ఓ దేవా రెక్కలు తొడిగిన మా ఆత్మ స్వరూపానివి నువ్వు
నువ్వు మాలో ఉండడమే మా ఉనికి
మా గుండెల్లో నీవు ఉంది తెలిపేదే మా కోర్కె!

మాలో నీ ప్రేరేపణే నీవైన రాత్రింబవళ్ళను
మావిగా మారుస్తున్నది.
నిన్ను ఏమి ఇవ్వమని కోరగలము?
మా కోర్కెలు నీ కెన్నడో తెలుసు.
నీవే మా అవసరం -
నిన్ను నీవు మాకు పూర్తిగా ఇచ్చుకోవడంలోనే
మా కోర్కెలన్నీ తీరుస్తున్నావు!"

---

# సంతోషం

సంతోషం స్వాతంత్ర్యగీతం!
కాని అదే స్వాతంత్ర్యం కాదు
అది నీ కోర్కెలు పుష్పించడం
కాని అదే వాటి ఫలంకాదు -
అది శిఖరాలను పిలిచేలోతు
కాని అదిలోతు ఎత్తులు కాదు -
అది పంజరం నుండి ఎగిరే పక్షి
కాని రోదసి దానిని ఆవరించలేదు -
ఆహా ! నిజంగా సంతోషం స్వాతంత్ర్య గీతమే !

మీరు హృదయ పూర్వకంగా గానం చేయగలరని ఆశిస్తాను
కాని పాడడంలో మీ హృదయాన్ని పోగొట్టుకో వద్దు
అదే సర్వస్వం అయినట్లు యువతరం సౌఖ్యాన్ని ఆశిస్తోంది
దానికి వారిని విమర్శించడం
వారిపై తీర్పు చెప్పడం న్యాయమా?
నేను వారిపై కోపించను, తీర్పు చెప్పను
వారినే వెతికి తెలుసు కోమంటాను :
నేలలో వేళ్ళ కొరకై తవ్వుతూ
కాణాచినికనుగొన్న కథవినలేదా !
తాగి చేసిన తప్పుల్లాగ, సౌఖ్యాలను విచారంతో
జ్ఞాపకం చేసుకుంటారు మీ పెద్దలు కొందరు.

# స ం తో ష ం

అయితే పశ్చాత్తాపం మెదడుకు మబ్బులు కప్పడమే కాని
దాన్ని మందలించడం కాదు
పంటను నూర్చుకున్నట్లు
సౌఖ్యాలనుకృతజ్ఞతో జ్ఞాపకం చేసుకోవాలి!

కోర్కెలను వదలు కోవడమే సౌఖ్యం !
ఆత్మను ఎవరు గాయపరచ గలరు ?
చకోరపక్షి రాత్రి నిశ్శబ్దాన్ని గాయపరచ గలదా ?
మిణుగురుపురుగు నక్షత్రాలను నొప్పించ గలదా ?
పొగ గాని మంటగాని గాలికి బరువా !
సౌఖ్యాలను విడనాడడంవల్ల
నీ హృదయాంత రాళంలో కోర్కెలను కుప్ప వేస్తున్నావు!
నీ శరీరం ఆత్మకు వీణ లాంటిది ;
అందులో నుండి తీయని సంగీతాన్నో
అర్థంలేని శబ్దాలనో పలికించడం నీ వంతు !

సౌఖ్యాల్లో ఏది మంచిదో,
ఏది చెడ్డదో ఎలా తెలుసు కోవడం ?
పొలాల్లోకి పూదోటల్లోకి వెళ్లి చూడు తెలుస్తుంది -
తేనెను పోగు చేయడం తేనెటీగకు సంతోషమనీ -
తేనెను తీసుకోనివ్వడంపుష్పానికి సంతోషమనీ -
తేనెటీగకు పుష్పం జీవన ధార అనీ
పుష్పానికి తేనెటీగ ప్రేమ దూతఅనీ
పుష్పానికి తేనెటీగకూ
సంతోషాన్ని ఇవ్వడమూ పుచ్చుకోవడమూ
అవసరం, ఆనందం అనీ!
మీ సుఖసంతోషాల్లో పుష్పాలు, తేనెటీగల్లా ఉండండి !!

---

# అందం

బాధ పడ్డవారు, అసంతృప్తిని పొందినవారు
అందాన్ని ''దయ, నమ్రత'' అంటారు.
యువ మాతృమూర్తి సిగ్గుతో వంగి నడిచినట్లు
నడుస్తుంది అందం మనమధ్య !
"అందం బలమైంది భయంకరమైంది"
అంటారు మోహాంధులు.
తుఫానులో నేలను ఆకాశాన్ని ఊగిస్తుంది అందం!

అలసినవాళ్లు అంటారు
"అందం మన ఆత్మతో మెల్లగా గొణుగుతుంది", అని.
"అందం కొండల్లో కేకలు వేయడాన్ని విన్నాం"
అంటారు విశ్రాంతి లేని వాళ్ళు-

పగటి వేళపని చేసేవాళ్ళు.
"పొద్దు కుంకు కిటికీ నుండి
అందం భూమిపై వంగి చూడడాన్ని చూశాం" అంటారు.
"తెల్లవారు ఝామున తూర్పు నుండి అందం ఉదయిస్తుంది"
అంటారు రాత్రి కాపరులు.
"అందం గ్రీష్మఋతువులోవస్తుంది" అంటారు
చలికాలంలో మంచు ప్రాంతంవాళ్ళు.

## అ ం ద ం

''అందం శిశిరంలో రాలే ఆకులతో,
వసంతంలో వేసే చిగుళ్ళతో నాట్యంచేస్తూ
కొప్పులో మంచు పువ్వులు
ముడుచుకుని రావడం చూశాం" అంటారు,
వేసవిలో పంట నూర్చేవాళ్ళు.

"అందం అవసరంకాదు - ఆనంద స్పదనం!".
అది దప్పికకొన్న కంఠంకాదు - పొంగిన హృదయం !
చాచిన రిక్తహస్తంకాదు - పరవశమైన ఆత్మ!
నీవు చూసే నీడకాదు - కళ్ళు మూసుకున్నా కనిపించే రూపం !
నీవు వినేపాటకాదు - చెవులు మూసుకున్నా వినిపించే గీతం !
అందం ఆకాశంలో ఎగిరే దేవదూతల సమూహం !!
అది నిరంతరం పుష్పించే ఉద్యానవనం !
మేలిమి ముసుగునుతొలగించి తన పవిత్రముఖాన్ని చూపినప్పుడు-
అయితే నీవే జీవితం - నీవే ముసుగు.
అద్దంలో తనను తాను చూచూకునే శాశ్వతత్వమే అందం !
అయితే శాశ్వతత్వం అద్దం నీవే !!

o — o

# మతం

మతం అంటే మన చేతలూ, ఆలోచనలేకాదా?
నమ్మకాన్ని చేతలను, ఎవరు వేరుచేయగలరు?
"ఇది దేవుడికి - ఇది నాకు" అనీ
"ఇది ఆత్మకు, ఇది శరీరానికి" అనీ
ఎవరు కాలాన్ని విభజించగలరు?
నీ కాలమంతా రోదసిలో, ఒక ఆత్మనుండి మరొక ఆత్మకు
రెపరెపలాడే రెక్కలేకదా?
నీతిని తమ ఉత్తమ దుస్తులుగా ధరించేవాళ్ళు
నగ్నంగా ఉండడమే నయం!
గాలి వెలుగు వాళ్ళ చర్మాల్లో రంధ్రాలు వేయలేవు
తన నడవడికను నీతినియమావళితో విప్పిచెప్పేవాడు
తన ఆత్మ అనే కోకిలను పంజరంలో బంధిస్తాడు!
ఉత్తమ స్వాతంత్ర్య గీతం
కటకటాల వెనుకనుండి వెలువడగలదా!

మ త ం

నీ నిత్యజీవితమే నీ ఆలయం! నీ మతం!
అందులో ప్రవేశించినప్పుడు
నీ అవసరానికీ, ఆనందానికీ కావలసిన
పరికరాలన్నిటినీ నీతో తీసుకవెళ్ళు -
నీ పగటి కలల్లోకూడా జయాపజయాలకు
అతీతుడవు కాలేవు గనుక !

దేవుడిని తెలుసుకున్నా
సమస్యల పరిష్కారానికి ప్రయత్నించకు
నీ చుట్టూ చూస్తే
నీ పిల్లలతోనే ఆడుకుంటూ ఉంటాడు దేవుడు!
ఆకాశంలో చూస్తే
మేఘాల్లో నడుస్తూ
మెరుపుల్లో చేతులు చాస్తూ
వర్షంలో దిగుతూ ఉంటాడు దేవుడు !
చెట్లల్లో చేతులు ఆడిస్తూ
పువ్వుల్లో నవ్వుతూ ఉంటాడు దేవుడు !

---

# చావు

జీవిత హృదయాంతరాళంలో వెతకందే
ఎలా కనుక్కోగలవు జీవిత రహస్యాన్ని ?
చీకటిలోనే చూడగలిగే గుడ్లగూబ
వెలుతురులోని మాయను తెలుసుకోలేనట్లు
నీ జీవిత హృదయంలో వెతకందే
మృత్యురహస్యం ఎలా తెలుసుకోగలవు ?
నదీ- సముద్రంలాగే
బ్రతుకూ, చావు ఒకటే!
రాజు గొర్రెలకాపరిని గౌరవించడానికి హస్తం ఎత్తగా
అతడు వణికినట్లే చావుగూర్చి నీ భయం !
గాలిలో నగ్నంగా నిలవడం
సూర్యుడి కిరణాలలో కరిగిపోవడం తప్ప
చావడమంటే ఏమిటి ?
దేవుణ్ణి కనుగొనడానికి విశ్రాంతిలేని అలలనుండి
శ్వాసను విడిపించడం తప్ప
శ్వాస ఆగడమంటే ఏమిటి ?
నిశ్శబ్దపు నీరు తాగినప్పుడే నీవు నిజంగా పాడగలవు
కొండ శిఖరం చేరినప్పుడే నీవు నిజంగా ఎక్కడం ప్రారంభిస్తావు
నీ అంగాలు మట్టిలో కలసినప్పుడే నీవు నిజంగా నాట్యంచేస్తావు

ం ం ం

హేతువు చీకటిలో దీపం!
కోపం వెలుగులో చీకటి!

---

## ధనం

ధనం అబద్ధపు ప్రేమకు పునాది
అసత్యమైన వెలుగుకు గ్రీష్మం ధనం
ముసలితనపు నిరాశ ధనం
విషపూరితమైన దిగుడు బావి ధనం
ధనం తంత్రుల వాద్యం
సరిగా మోగించ లేకపోతే
అపశ్రుతులే వినిపిస్తాయి!
ధనం ప్రేమలాంటిది
దాచుకున్న వారిని మెల్లగా చంపుతుంది
దానిని పంచిన వారికి జీవాన్ని ఇస్తుంది!

ం ం ం

## తల్లి

తల్లి సర్వస్వం !
దుఃఖంలో ఆమె మనకు ఓదార్పు
కష్టాల్లో ఆమె మనకు ఆశ
శక్తి లేనప్పుడు ఆమె మనకు బలం
ప్రేమకు, దయకు, క్షమాపణకు ఆమె మూలం
తల్లిని కోల్పోయినవాడు
తన రక్షణనే పోగొట్టు కున్నవాడు!

## ఊహకు దృష్టికి వంతెన కళ!

కళ చిత్రకారుడి ఊహకు
ప్రేక్షకుడి దృష్టికి
వంతెనగా ఉండే సందేశమే!
అందుకే తన ఊహలను
విచ్చలవిడిగా చరించకుండా
తనకళా రచనతో వేయాలి కళ్ళెం
లేకుంటే కళ అవుతుంది నిరుపయోగం.
దేవుడు మనిషిని సృష్టించాడా
లేక నిజంగా మనిషే దేవుడిని సృష్టించాడా?
ఊహ తప్ప-సృష్టి అంటే మరేమిటి?
ఊహకు సన్నిహితమైన కల్పన కళ
జీవితమే కళ!

ం ం ం

## మరణం చైతన్యం!

ప్రపంచ ఇహపర సౌఖ్యాలు ఒక స్వప్నం లాంటివే!
మానవ శరీరంలో ఆత్మ బీజం
మరణ దినం చైతన్య దినమే!
అదే పునః సృష్టి సమయం!!
మనిషికి మరణం అంతమేకాని,
ఆత్మకు మరణం ప్రారంభం!
అది జీవిత విజయం
మరణం స్పర్శను తొలగిస్తుంది కాని
జ్ఞానాన్ని కాదు!

## దేవుడేమనం!

దేవుడనే పేరుతో
మనిషి తనను తానే ఆరాధించుకుంటాడు !
దేవుడేమనం - మనమే దేవుడు!
దేవుడిని గూర్చి కథ లెన్నో వర్ణించే బదులు
తోటిమానవుడిని పలకరించి అర్థంచేసుకుంటే
దేవుడిని పార్థించినట్లే!
మనుషులు దేవుడి శ్వాస, సువాసనలు కాదా?
ఆకులు, పువ్వులు, పండ్లు కాదా దేవుడు?

---

## రోగి మహాభోగి!

ఆరోగ్యం కంటే అనారోగ్యమే మంచిది
అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు!
జబ్బులో శాంతిని పొందుతారు కనుక !
రోగికి సభలు, సమావేశాలతో పనిలేదు
విందులు, వినోదాలు, విన్నపాలు
అధికప్రసంగం, టెలిఫోను బాధలు ఉండవు !
కళ్ళుమూసుకొని ఆలోచనలో మునిగితే
ఆకాశంలో, స్వర్గంలో తేలి ఆడినట్లు ఉంటుంది!
అందుకే రోగి మహాభోగి !!

నీకష్టాలను దాచుకోగలిగితే
ఆకాశం విరిగి పడినా
సముద్రం ఘోషించినా
లేదు నీకు భయం

o-o-o

ఆశబోతు ధనికుడి ముందు పేదవాడు
పేదవాడిని ప్రేమిస్తాను
అతడు బలవంతుడి ముందు బలహీనుడు కనుక!
అందుకే పేదవాడిని ఓదారుస్తాడు
అతనికై కన్నీరు విడుస్తాను
న్యాయం అతడిని కౌగిలించుకోవాలని కోరుతాను
బాధించివేధించే వారి బారి నుండి
అతడిని తప్పిస్తూ వారిని క్షమిస్తూ
అతడిని ఓదార్చాలని చూస్తాను !

o-o-o

స్వంత గొప్పతనానికి కారణం స్వలాభం
అది తెగల ఉత్పత్తికి కారణం
తెగలు కల్పిస్తాయి ఆధిక్యత
ఆధిక్యత నిరసనకు, దాశ్యానికి తీస్తుంది దారి !

o-o-o

హేతువు-విద్య, శరీరం-ఆత్మలాంటివి
విద్యలేని హేతువు సాగుచేయని భూమిలాంటిది
నియంతలు దోచుకోలేని ధనం విద్య ఒక్కటే !

o-o-o

అందంలేదు హృదయంలో
అందం హృదయంలో వెలుగు

o-o-o

దేహం-ఆత్మలాగ
పుష్పం-సుగంధం ఒకటే
పూవు ఎండి రాలగానే, సుగంధం వీడినట్లు
దేహం కృశించగానే ఆత్మ వేరౌతుంది
గుడ్డివాడు వాసననే కాని ఆకారం లేదు అనుకుంటాడు పుష్పానికి
వాసన చూడలేనివాడు ఆకారం తప్ప
ఇతరం లేదనుకుంటాడు పుష్పానికి!

o-o-o

మానవ జీవతం
సముద్రపు అలలపై తేలే నురుగు లాంటిది !
గాలివీచగానే నురుగు మాయమై
అసలు లేనట్లే అనిపిస్తుంది.
అలాగే మన జీవితాలను ఆర్పేస్తుంది చావు !

o-o-o

ప్రాణం-మొదలు గర్భంలోగాని
దాని తుది సమాధి లోగాని ఉండదు.
మధ్యస్థ జీవితాల్లో వెలుగుతుంది ప్రాణం
జీవిత ప్రమాణం శాశ్వత జీవితంలో ఒక క్షణమే !

o-o-o

నేటి నగరాలు సంప్రదాయానికి కట్టుబడి ఉన్నాయి
అందులో నివసించే పౌరుల ఆత్మలు కుళ్ళు పట్టాయి
వారి ఆలోచనలు పాతవి, అరిగిపోయినవి
ఆశ్చర్యం!
నగరాల్లో కుళ్ళి పోయేవి గర్విస్తాయి!
అరిగిపోయేవి తలెత్తుకు తిరుగుతాయి!

o-o-o

వదరుబోతు తనం కాదు విజ్ఞానం!
మౌనం కాదు అజ్ఞానం!

o-o-o

ఖూనీకోరుల్లో ఎన్నడూ ఖూనీ చెయ్యని వాళ్ళు
దొంగల్లో ఎన్నడూ దొంగలించని వాళ్ళు
అసత్యవాదుల్లో ఎన్నడూ అబద్ధమాడని వాళ్ళు
ఉన్నారు ఎందరో లోకంలో!

o-o-o

ఋతువుల సహాయం లేకుండా
పెరిగి పుష్పించేది ప్రేమ పుష్పం ఒక్కటే!

o-o-o

మధువు రంగు కనిపించనిదే
పాత్ర ఆకర్షించదు పెదవులను !
అలాగే-ఎంతో చక్కని మోమైనా
హృదయంలో దాగిన భావాలను
ప్రతిబింబించనిదే
కాజాలదు ఆకర్షణీయం ఆముఖం!

o-o-o

గ్లాసులో కనిపించేది ద్రవం
ద్రవంలో దాగి ఉండేది సారామత్తు-
అలాగే నీ జబ్బే నీ ఔషధం!

o-o-o

ధనవంతులు బంగారాన్ని ఆర్జిస్తూ గడిపే జీవితం
సమాధిలో పురుగు జీవితం లాంటిది !
అది భయానికి చిహ్నం.
బంగారం బంగారు సంపాదనకు
తర్వాత విశ్రాంతి, తీరిక లేమికి
ఆటు తర్వాత కృశింప చేసే సంక్షోభానికి తీస్తుంది దారి!

## చీకటిలో దీపం

కష్టాలను, అవరోధాలను ఎదుర్కోవడం
ముక్కుమూసుకొని మూలకూర్చోవడం కంటే ప్రశంసనీయం!
చీకటి బిలంలో నివసించే పురుగుకన్నా
చచ్చేంత వరకు ప్రమిదకోడి చుట్టూతిరిగే కీటకం
ఎంతో ప్రశంసనీయం !

-o-o-

కఠోరమైన బాధ అనుభవించినా అది కాదు నరకం
ఉంటుంది శూన్యహృదయంలో నరకం!
ఆశించడం ఒక జాడ్యం
అలాగే ధనం, పదవి, కీర్తి, ఉనికి !

-o-o-

సువాసన చూచాయగా కూడావెదజల్లకుండా
నశించే పుష్పాలు ఉన్నాయిఎన్నో!
ఒక్క నీటి బిందువునైనా వర్షించకుండా
ఆకాశంలో గుమిగూడే గాఢాలు మబ్బులు ఎన్నో!

-o-o-

అందం ఆత్మను ఆకర్షించేది
ప్రేమించేది, త్యాగం చేసేదే కాని
ప్రతిఫలాన్ని ఆశించేది కాదు!

-o-o-

నిజంగా ఉనికి లేనిదాన్ని-
చూడడానికి, వినడాని తెలుసుకొవడానికి వీలుకాదు!

పాతను మెరుగు పర
భవిష్యత్తులోనికి ము

న్యా యా ని కి నో రు

సముద్రంలాగా, ఋతువుల్లాగా
దూరంగా లేందే నీ దగ్గరకు ఎలా రాగలను?

0-0-0

అనుమానం లేకుంటే నమ్మకానికి అర్థం ఏమిటి?

0-0-0

మీరు శరీరంలో కాని
గృహాల్లో కాని బంధించ బడలేరు
భూమ్యా కాశాల్లో
స్వతంత్రంగా తిరిగే ఆత్మలు మీరు!

0-0-0

అన్నిటికీ మొదలు అస్పష్టత
జీవితం పొగమంచులో పుట్టింది-
స్ఫటికంలో కాదు
శిథిలావస్థలో ధూళి కా దా స్ఫటికం?

0-0-0

అన్నింటిలోను దాగిఉన్న ఆంతర్యం
ఒకనాడు వ్యక్తం అవుతుంది.
వెలుతురును కొలిచినట్లే
చేకటిని దీవిస్తారు!

0-0-0

మనిషి అవసరాలు మారుతాయి
కాని తనప్రేమ, కోర్కెలు కాదు.
నవ్వుకంటే తియ్యనిది
కోర్కెకంటే గొప్పది
కణాలుగా ఉన్న అంతులేని మనిషి
గొలుసులో బలహీనపు లంకేలా
నీవుకూడా బలహీనుడవే

అయితే అది సగం నిజం మాత్రమే!
గొలుసులోని దృఢమైన లంకెలా
నీవు బలవంతుడవు కూడా!
అతిచిన్న చర్యతో నిన్ను కొలవడం
నురుగుతో సముద్రపు శక్తిని కొలిచినట్లే !

o-o-o

హృదయమే సింహాసనమైతే
ప్రేమే దాన్ని అధిష్టించే రాణి
ముద్దుల పెదవుల కలయికే జీవితగానం!

o-o-o

అంతులేనంత పనికిమాలిన తెలివికంటే
ఉపయోగపడే తెలివి కొంచెమైనా అంతులేనిదే!

o-o-o

అనేకమంది
మాటల్లో సముద్రపు అలల్లా ఘోషిస్తారు
సింహాల్లా గర్జిసారు
కాని జీవిస్తారు-గుంటల్లో
నిలువబారిన నీటిలామురికివాసన కొడుతూ-
గడుపుతారు జీవితాలు తలఎత్తుకొని పర్వత శిఖరాల్లా !

o-o-o

నీతి లేనివాడిని మందలించడం
నీళ్ళపై వ్రాసినట్లే!

o o

దాస్యానికి కట్టుబడి జీవించే కంటే
స్వాతంత్ర్యానికి ప్రాణాలివ్వడం ఘనం !
స్వాతంత్ర్యం లేని జీవితం
ఆత్మలేని శరీరం లాటిది!

ఆలోచనలేని స్వాతంత్ర్యం
దిగ్భ్రమచెందిన ఆత్మలాంటిది!

000

మనిషిని బంధించ వచ్చు-కాని
ఆత్మను బంధించలేం.

000

జీవితం చావుకంటే బలహీనం
చావు సత్యాని కంటే బలహీనం!

000

ఒంటరితనపు మహాసముద్రంలో
జీవితమొక ద్వీపం
అచటి కొండలు-ఆశలు, చెట్లు-స్వప్నాలు
ఏకాంతం-పుష్పం, దప్పిక-సెలయేరు.

000

నేటి ప్రపంచంలో రెండు భావాలున్నాయి
ఒకటి పాతది-
తన శక్తిలేమిచే అలసి అదృశ్యమై పోయింది!
రెండోది క్రొత్తది-
స్తబ్దతనుంచి మేల్కొలిపి చైతన్యాన్ని కలిగించేది !
అది పెరిగి వ్యాపిస్తుంది
గొప్ప హృదయాలనూ నిశిత మనసులనూ ఆవరిస్తుంది!

000

పాలకులు రెండు రకాలు-
ఒకరు-నిర్ణయించి, తీర్పుచెప్పి
లొంగ తీసుకొనేవారు
అలాంటివారు త్వరగా నశిస్తారు.

రెండవవారు-న్యాయానికి బద్ధులై
నిశ్శబ్దంగా కాలంతో పయనిస్తారు
వారు తమ జీవితంలో
జీవితగమ్యంలో నమ్మకం కలవారు.

O O O

ఈ నవతరం నిద్ర మెలకువలమధ్య జీవిస్తున్నది.
తన చేతుల్లో భూతకాలవు మట్టిని,
భవిష్యత్తు బీజాలను పట్టుకొని పయనిస్తుంది!

O O O

హద్దులు గల ప్రేమ
తన వారందరికి
ఇహ సుఖాలనుఅందిస్తుంది.
హద్దులులేని ప్రేమ
తననే తాను కోరుతుంది.

O O O

మనిషి కోర్కెలను
ఐహిక వస్తువులతో
తీర్చుకో ప్రయత్నించడం
నిప్పును ఎండు గడ్డితో ఆర్పడానికి ప్రయత్నించినట్లే!

O O O

పదవిని పొందటం
పదవిలో ఉండటం కాదు ఘనత
పదవిని తిరస్కరించ కలగడం
అవుతుంది అసలైన ఘనత!

O O O

అందం సుఖదుఃఖాలు మేళవించే మహత్తరశక్తి
నీలో మొలకెత్తి ఇహానికే అతీతంగా పెరిగేది అందం
అందం నీ హృదయాన్ని స్త్రీకి చేరువగా చేరుస్తుంది
ఆమె నీ జీవితానికి ఆలయం!

## న్యాయానికి నోరు

జీవితం నగ్నసౌందర్యం
నగ్నశరీరం సత్యానికీ, ఔన్నత్యానికి చిహ్నం!

ooo

నిజం మాట్లాడనికి వినయం అడ్డువస్తే
అదిమోసమే అవుతుంది!
చిరునవ్వుకు పవిత్ర ప్రతిరూపం కవిత్వం!
కన్నీటిని ఆర్పే నిట్టూర్పు కవిత్వం
ఆత్మలో వశించే జీహాత్మ కవిత్వం!
దానికి భుక్తి హృదయం
పానీయం ప్రేమ
అలాంటిది కాకుంటే
కవిత్వం అవుతుంది దొంగవేషదారి
ధన స్వాముల స్వారి గుర్రం!

ooo

మేధాశక్తిని, తెలివిని
ప్రసాదించాడు దేవుడు మనిషికి
కోర్కెల చీకటి కోనల్లో
దైవమిచ్చిన దివ్వెను ఆరనివ్వకు
విజ్ఞానపు కొవ్వత్తిని కరగ నివ్వకు
జ్ఞాని-మానవ జీవితమార్గానికి చూపాలి వెలుగు!

ooo

మనిషి నిజ స్వభావమే దైవత్వం
అది బంగారావికైనా అమ్మబడదు.
ధనాగారాల్లో రాసులు పోయవీలుగాదు
ధనికుడు తన దివ్యత్వాన్ని వదులుకొని

బంగారానికి కట్టుబడతాడు
నేటి యువకులు దైవత్వాన్ని పీడి
శరీర సౌఖ్యాల్లో మునుగుతున్నారు.

○○○

ధైర్యం అగ్నిపర్వతం-
ఆ మంటల్లో "ఆ నిర్ణయం" అనే బీజం
మొలకెత్త లేదు.

○○○

దుర్మార్గంతో పోరాటానికి ''అతి'' అవసరం-
నిజం చెప్పడంలో "వినయం" అవుతుంది అబద్ధం!

○○○

బంగారం తీస్తుంది దారి బంగారానికి
తరవాత, అశాంతికీ
అటుపిమ్మట భరించరాని దుఃఖానికీ!

○○○

మరోక్షణంలో మరోగర్భంలో జీవిస్తాం!

○○○

నీవు దుఃఖం అనే ఉయ్యాలలో పుట్టి
దురదృష్టం అనే కౌగిలిలో పెంచబడ్డావా?
కన్నీటితో తడిచిన గంజి మెతుకులు తింటున్నావా?

○○○

జీవితం మనలను
ఒక చోటు నుండి
మరొకచోటుకు చేరుస్తుంది
అదృష్టం ఒక స్థలం నుండి
మరొకస్థలానికి మారుస్తుంది
వీటి రెంటిమధ్య ఇరుకు కొన్న మనం
అన్నీ అద్దంకులనే చూస్తాం!

మూర్ఖుడితో స్నేహం తాగుబోతుతో వాదనలాంటిది!

ООО

కీర్తి అనే సింహాసనం పై కూర్చున్నప్పుడే కనిపిస్తుంది అందం
కాని మనం కామం పేరుతో అందాన్ని చేరుతాం
ఆమె కిరీటాన్ని లాగి
బంగారు దుస్తులను మలినం చేస్తాం
వినమ్రత దుస్తులతో
ప్రేమ మనవైపు నడుస్తుంది
మనం భయంతో పరుగెత్తుతాం
చీకటిలో దాక్కుంటాం
లేకపోతే తరిమికొడతాం.
ప్రకృతి చేతులు చాచుకొని
తన అందాన్ని అనుభవించమని
మనలను చేరుతుంది
కాని ఆమె నిశ్శబ్దానికి భయపడి
మనం జనబాహుళ్యమైన పట్టణాలకు
గొర్రెల మందల్లా పరుగెత్తిపోతాం.

ООО

ప్రజలే సామ్రాజ్యానికి సౌభాగ్యం

ООО

మర్కటజాతితో
మనం బాంధవ్యం వదులుకున్నట్లే
రాబోయే తరంవారు
మనతో సంబంధం తెంచుకునే యుగం
త్వరలోనే రావచ్చు!

ООО

# విశ్వకవి

ఖలీల్ జిబ్రాన్ జననం 1883 లో Holy Cedars దగ్గర లెబొనాన్‌లోని బెకారి గ్రామంలో. ఆయన చిన్నతనంలోనే తన కుటుంబంతో U.S.A. కు వలస వెళ్ళారు. 1931 లో మరణం. ఆయన మొదటి అరబ్బీలో, తర్వాత ఆంగ్లంలో అనేక రచనలను గావించారు. "తూర్పు పడమరలు కలవ జాలవు" అన్న మార్క్ ట్వెయిన్ వాక్కు నిజంకాదని నిరూపించిన మహా మేధావి, తత్వవేత్త, విశ్వకవి జిబ్రాన్. స్పెయిన్ నుండి, చైనా వరకు విరివిగా ఆయన రచనలు ప్రసిద్ధిచెంది "జిబ్రానిజమ్"అనే కొత్త ''ఇజమ్" వెలువడింది. పాశ్చాత్య ప్రపంచంలో 20 వ శతాబ్దపు ''డాంటే - Dante" అని జిబ్రాన్ పేరు పొందారు.

ఆయనకు దేశభక్తి స్వాతంత్ర్య పిపాస ఎంతో ప్రధానమైనవి. ఆయన చర్చి (Church) నుండి కూడా వెలివేయబడ్డాడు. అయినా ''గుడిలో, మసీదులో, చర్చిలో ప్రార్థించినా నిన్ను ప్రేమిస్తాను సోదరా" అన్నాడు మానవాళిని సంబోధిస్తూంది. కొంత కాలానికి ఆయనను బహిష్కరించిన మత సంస్థతిరిగి పిలిపించి, క్షమాపణ కోరుకున్నది.

జిబ్రాన్ కవితలు, కథలు, వ్యాసాలు విజ్ఞాన పూరితంగా ఉంటాయి. ఒక ప్రేమ కథలో మొదటి ముద్దు జీవిత గీతానికి ప్రారంభం; అది నాలుగు పెదవులతో పలుకబడుతుంది. హృదయం దానిని సింహాసనమనీ. ప్రేమ రాజు అనీ జీవిత వృక్షానికి ముద్దు మొదటి పుష్పము" అనీ అన్నాడు.

ఆయన స్వాతంత్ర్య ప్రియత్వం ఎనలేనిది, నియంతను గురించి ''నా చేతులకు నీవు సంకెళ్లు వేయవచ్చు; నా కళ్లకు శృంఖలాలు తగిలించవచ్చు. నన్ను కటిక చీకటి ఖైదులో బంధించవచ్చు; కాని నా ఆలోచనలు నీకు బానిసగా చేయలేవు; ఎందుకంటె ఆలోచన స్వేచ్ఛ గలది కనుక'' అన్నాడు.

జిబ్రాన్ ప్రఖ్యాత రచన ''ప్రవక్త'' (Prophet)ను ప్రపంచంలో కోట్ల కొలది ప్రజలు చదివి వుంటారు. ఆయన గొప్ప చిత్రకారుడు కూడా. ఆయన చిత్రాలు, రచనలు, అనేక దేశాల్లో ప్రఖ్యాతి కెక్కాయి. ఈ గ్రంథానికి ముఖచిత్రం ఆయన గీసిన చిత్రాల్లో నుండి ఎన్నుకోబడింది.

# ప్రజాకవి

శ్రీ యల్. మాలకొండయ్య గారి జననం1927. చదువు మద్రాసు లయోలా కళాశాల. M. A. ఎకనమిక్స్ ప్రథమశ్రేణి. విద్యార్థిగా, సాహిత్య సాంస్కృతిక క్రీడారంగాల్లో అనేక బహుమతులను పొందారు. తరువాత రష్యన్ భాషలో సీనియర్ డిప్లొమా, ఎకనామిక్ డెవలప్‌మెంట్‌లో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా (నేపిల్స్, ఇటలీ) పొందారు. హిందీ, తమిళ, జర్మన్ భాషల్లో పరిచయంతోపాటు ఇటాలియన్, రష్యన్ భాషల్లో ప్రత్యేక ప్రవేశాన్ని సంపాదించారు.

1950 లో డిప్యూటీ కలెక్టరుగా అప్పటి అవిభక్త మద్రాసు రాష్ట్రంలో ప్రథమ శ్రేణిలో సెలక్టు అయ్యారు. వీరికి రాష్ట్రస్థాయి రెడ్ క్రాస్ బంగారుపతకం, అఖిల భారత స్థాయిరెడ్ క్రాస్‌మెరిట్ అవార్డులు బహూకరించబడ్డాయి. కరీంనగరం, తూర్పు గోదావరి జిల్లాలకు కలెక్టర్‌గా ఎనలేని ప్రజాసేవ చేసి అందరి మన్ననలను పొందారు. చేనేత పరిశ్రమ డైరెక్టరుగా, ఆం. ప్ర. మైనింగ్ కార్పొరేషన్ ఉపాధ్యక్షులుగాను, మేనేజింగ్ డైరెక్టరుగాను, పని చేసి ఆ సంస్థకు ప్రపంచ ప్రఖ్యాతిని సంపాదించారు. ఇప్పుడు రాష్ట్రఎక్సైజ్ కమీషనర్‌గా ఉంటున్నారు.

ఆంధ్రప్రదేశ్ ఫోటోగ్రఫీ అకాడమీకి, వ్యవస్థాపక కార్యదర్శి. యుగకర్త కీ. శే. శ్రీ కందుకూరి వీరేశలింగంగారు ప్రారంభించిన సంఘ సంస్కరణ కార్యక్రమాలకు మళ్ళీ నిండుజీవంపోసిన క్రియాశీలి. వీరిది కవితాదృష్టి, వీరు అనేక పత్రికలకు వ్యాసాలు, రేడియో, టెలివిజనులకు, చలన చిత్రాలకు కథలు, వ్యాసాలు పాటలు వ్రాసి ప్రజలమన్నన పొందుతున్నారు.

వీరి సాహిత్య కృషి సమసమాజనిర్మాణానికి ఒక మహోద్యమం కాగలదనే ఆశాభావం కలిగిస్తుంది. వారి కలం నుంచి ప్రజాక్షేమం, సౌభాగ్యం, సంస్కారం, సానుభూతి, సహకారాది భావనలు వెలువడతాయి. వీరి భాష ప్రజాభాష. భావాలు ప్రజాభ్యుదయ మార్గదర్శకాలు. వీరు చెప్పినదిచేసి, చేసినది వ్రాసే చిత్త, శుద్ధి, ధైర్యంగల ప్రజాకవి.

## శ్రీ మాలకొండయ్యగారి రచనలు

(1) జీవిత వలయాలు
(2) మనిషికి మనిషి
(3) కాలంవెంట కవి
(4) పాపా నీకు తెలుసా!
(5) న్యాయానికి నోరు

### అచ్చులో

(6) ముళ్లబాట (నవల)
(7) మొదటి చూపులో (నవల)